ప్రచురణకర్తలు:

వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు,

పోస్టుబాక్సు 1372, మద్రాసు. 1.

ముద్రాపకులు: శ్రీ రామా ప్రెస్, మద్రాసు.

ప్రథమ ముద్రణ: హేవిళంబి సంవత్సరం.

ప్రతులు: ... 1500





## ★ ముఖ్య పాత్రలు ★

1. కృష్ణయ్య
2. కొందరు గోపికలు



# గోపికా వస్త్రాపహరణం

## ★ 1. వ, ర ం గ ం ★

[ గోపికలు కొందరు యేటి నుంచి నీళ్లు తీసుకు పోతున్నారు. అందులో ఒకామె యేదో దీర్ఘంగా ఆలోచిస్తోంది. అప్పు డప్పుడు ముసి ముసి నవ్వులు నవ్వుకుంటోంది; నిట్టూరు స్తోంది.

అదంతా ఆమె స్నేహితురాండ్రు కొందరు గమనిస్తూనే ఉన్నారు. ]

గోపిక: 1. ...మనిషయితే మన మధ్యనే ఉంది; కాని, దాని మనసుమాత్రం...

2. ఊఁ...! ఇప్పుడేకాదు; యి దెప్పుడూ యింతే! ఎక్కడో చూస్తూ, యేదో ఆలోచిస్తూ ఉంటుంది. మనకు కనబడని యెవరితోనో యేమేమో మాట్లాడుతూ ఉంటుంది. అంతులేని ఆనందంతో యెంతసేపైనా అలాగే ఉండి పోతుంది.

[ అంతలో, ఆలోచనలో ఉన్న గోపిక నెత్తిమీది కుండ కొంచెంగా ఒరిగింది; నీళ్లు కారిపోసాగినై. అయినా, ఆమె కది తెలియదు. ఆమె, తన ఆలోచనలో తాను మునిగి ఉంది. ]

3. ...అందుకనే అది యేపనిచేసినా...

( కారిపోతున్న నీటిని చూపుతూ )

...యింత చక్కగానూ ఉంటుంది!

[ అది విన్న కొందరు గోపికలు కిల కిల లాడారు. అంతవరకూ పరధ్యానంలో ఉన్న గోపిక అప్పుడు వాళ్లవేపు

చూసింది. వాళ్లు తనవంక చూసి నవ్వుకోవటం గ్రహించింది. వెంటనే తన నెత్తిమీది కుండను సరిచేసుకుంది.

అంతలో ఆమె కళ్లు నీళ్లతో నిండిపోయినై. అది గమనించిన ఆమె స్నేహితురాలు ఒకామె ఆమెవంక సానుభూతితో చూసింది ; అక్కడే ఆగింది ; ఆమెను చేయిపట్టుకుని నుంచో పెట్టింది. మిగిలిన గోపికలు అదేమీ గ్రహించకుండానే ముందుకు సాగిపోయినారు. ]

1. ...బృందా...!

[ కన్నీరు పెట్టుకుంటున్న గోపిక, బృంద, తలెత్తి, 'ఆఁ... యేమిటి ?' అన్నట్టుగా ఆమె వంక చూసింది. ]

...మనమధ్యనే యింత దాపరికమైతే యెలా చెప్పు !

బృంద: ( తత్తరపాటుతో )

ఉఁహుఁహుఁ...యేముంది ?

గోపిక: 1. ఉన్నదో లేదో నీమనసుకు తెలియదూ ?

[ ఆ మాట విని, బృంద, తన రహస్య మేదో బయట పడ్డట్టుగా కలవరపడ్డది. ]

బృంద: ...ఏముంది...? ఏమీ లేదు !

గోపిక: 1. ఏమీ లేకపోతేనే యిలా ఉంటున్నావా ? నిజం చెప్పు !

బృంద: ( చిరునవ్వుతో )

ఎలా ఉన్నాను ? పిచ్చిదానల్లే ఉన్నానా...? ఊఁ... ?

గోపిక: 1. ఆఁ...అచ్చంగా అలాగే ఉన్నావు !

బృంద: ( వెఱ్ఱిగా నవ్వి )

...అయితే కావచ్చు. నిజమే అయి ఉంటుంది ! పిచ్చి ఆలోచనలు పెట్టుకుంటే పిచ్చిగా ఉండక యెలా ఉంటాను ?

గోపిక: 1. ఆ ఆలోచనే యేమిటీ అని...!

బృంద: ( నవ్వుతూ )
ఊఁహుఁ...చెప్పను! అది వింటే నువ్వు కూడా పిచ్చిదాని వైపోతావు!

గోపిక: 1. ...అయితే పోతాను...నష్టమేముంది? నీతో బాటే నేనూను!

బృంద: ( చిలిపిగా )
ఊఁ...! బాగానే ఉంది!

గోపిక: 1. చెప్పవ్! ఊఁ...? ఆ ఆలోచనేమిటో చెప్పవ్?

బృంద: ( చిరునవ్వుతో )
...ఇహ, చెప్పక తప్పుతుందా...?

గోపిక: 1. ఏమనుకున్నా సరే...చెప్పి తీరాలిసిందే!

బృంద: ఊఁ...అయితే విను!
అనగా అనగా ఒక ఊళ్లో ఒక అబ్బాయి ఉన్నాడు. ఆ ఊళ్లోనే యెంత మందో అమ్మాయిలు కూడా ఉన్నారు.

[ గోపిక అదో విధంగా బృంద వంక చూసింది. ఆమె చెప్పేది శ్రద్ధగా వినసాగింది. ]

ఆ అబ్బాయి అంటే ఆ అమ్మాయి లందరికీ ప్రాణమే!

గోపిక: 1. ( చిరునవ్వుతో )
ఊఁ... అలాగా?

బృంద: ...ఆఁ...! ఆ అబ్బాయి అందరితోనూ ఆటలాడు తాడు. అందరితోనూ మాట్లాడుతాడు; కాని, యెప్పుడుచూడు, అంటీ ముట్టనట్టుగా మాత్రం ఉంటాడు.

[ అంటూ కొంచెం కిలకిల లాడింది. గోపిక ముసి ముసి నవ్వులు నవ్వింది. ]

...ఆ అబ్బాయికి ఒకేఒక స్నేహితురాలు ఉంది. చూసేవాళ్లకి మాత్రం, అదంటే అతనికి ప్రాణం కాబోలు అని పిస్తుంది; కాని, నిజానికి ఆయనే దానికి ప్రాణం.

[ గోపిక 'అదెవరా' అన్న ఆలోచనలో పడ్డని. ఆమె కళ్లల్లో కొంచెంగా యీర్ష్య కనిపించింది. ]

అందరూ దాన్ని 'మురళి' అని ముద్దుగా పిలుస్తారు.

[ అది విన్న గోపిక కిలకిల లాడింది; బృంద కూడా కొంచెంగా నవ్వింది. ]

అదెప్పుడూ ఆయన పెదిమలమీాదనే నాట్యంచేస్తూ ఉంటుంది.

...అలా ఉండటానికి, అ దేంపుణ్యం చేసుకుందో?

గోపిక: 1. ఊం...? ఇదే అన్నమాట నీ ఆలోచన...?

బృంద: ఆం...! ఇదే! ముమ్మాటికీ యిదే! 'నేనే ఆ మురళి నైతే యెంత బాగుండేది' అని. అయినా, ఆ అదృష్టం అందరికీ లభిస్తుందా? ఆ మురళిగా పుట్టాలీ అంటే, యెన్ని నోములు నోచుకోవాలో...యెన్ని వ్రతాలు చెయ్యాలో... యెన్ని జన్మలెత్తాలో ... యెవరికి తెలుసు?

[ ఆ మాట అంటూ ఉండగానే ఆమె చెక్కిళ్లవెంట కన్నీరు కాలువై పారింది. అది గ్రహించిన గోపిక ఆమెవంక సాను భూతితో చూసింది. ]

గోపిక: బృందా!

[ కన్నీళ్లు తుడుచుకుంటూ, బృంద, 'ఆం . యేమిటి!' అన్నట్టు ఆమె వంక చూసింది. ]

...ఆ కోరిక అంత దృఢంగానూ ఉంటే ఆ వేణువువే కాదు ఆయన రాణీవి కూడా అయి తీరుతావ్!

[ బృంద, ఓరగా గోపిక కళ్లల్లోకి చూసింది; కిల కిల లాడింది.

కాని...అలా కావాలంటే ఒక పని చేయాలి!
చేస్తావా ?

[ 'ఆ' అన్నట్టు బృంద తల ఆడించింది. ]

అయితే, రేపటినుంచీ చీకటితో లేచి, మాతో
రావాలి!

బృంద: ...ఎక్కడికి...?

గోపిక: 1. ఉస్...స్...! అదే అడక్కూడదు! అసలు రహ
స్యమే అది!

[ బృందా గోపికా ఒకరి వంక ఒకరు చూసుకుని ముసి ముసి
నవ్వులు నవ్వుకున్నారు; చెట్టా పట్టాలు పట్టుకుని అక్కడి
నుంచి కదిలి వెళ్లారు. ]



## ★ 2. వ, రంగం ★

[ అప్పటి కింకా తెల్లవారలేదు. చలిగాలి వీస్తోంది. కొద్దిగా మంచు కూడా కురుస్తోంది.

ఆ సమయంలో కొందరు గోపికలు యమునానది ఒడ్డున కూర్చుని, ఇసుకతో తయారు చేసిన కాత్యాయనీ విగ్రహానికి పూజ చేస్తున్నారు. అప్పుడే స్నానంచేసి రావటంవల్ల వాళ్ల బట్టలు తడిసి ఉన్నై ; నీళ్లు కారుతున్నై.

కాత్యాయనీదేవి పూలతో అలంకరింపబడి ఉంది. ఆమె విగ్రహంముందు దీపాలు వెలుగుతున్నై.

గోపికలు అప్పుడే కర్పూరం వెలిగించారు. ]

**గోపికలు:** ( ఏక కంఠంతో )

"ఓ కాత్యాయని భగవతి
నీకుఁ మ్రొక్కెదము నేము నే డనుకంపఁ
మా కిందరకును వైళమ
శ్రీ కృష్ణుడు మగడు గాగ జేయుము తల్లీ"

"ఓ తల్లి మాకు కృష్ణుడు
చేతోవిభు డైన నాడు చెలువల మెల్లఁ
నేతి వసంతము లాడుచు
జాతర సేసెదము భక్తి చాతురితోడఁ"

[ ఆలా ప్రార్థించి వాళ్లందరూ ఆ దేవిముందు సాష్టాంగ పడ్డారు.



## ★ 3. వ, ర ం గ ం ★

[ కృష్ణయ్య వేణువు నూదుకుంటూ నది వేపుగా వస్తున్నాడు. అదే సమయానికి, గోపికలు, నదినుంచి యిళ్లకు వెడుతున్నారు. అంతలో కృష్ణయ్య వారికి కనబడ్డాడు. అతణ్ణి చూడగానే వాళ్లు సిగ్గుపడ్డారు; 'రహస్యం బయటపడ్డదే' అనుకున్నట్టుగా తలలు వంచుకున్నారు; తిరిగి అతని వంకచూశారు.

కృష్ణయ్య అదంతా గ్రహించాడు. గ్రహించి, వేణువు నూదటం ఆపేసి మందహాసం చేశాడు. ఆ వెంటనే, తన దగ్గిరికి రమ్మని వారికి సైగ చేశాడు.

గోపికలు, యీ మాటు అమితంగా సిగ్గుపడ్డారు. ]

**గోపిక:** 1. ...అదుగో...పిలుస్తున్నాడు; చూశావా ?

2. ఊఁ...! పిలవ కేం చేస్తాడు ?

3. పిలిస్తే పిలిచాడు! ఏమంటాడో యేమో...?

4. అసలే కొంటె కోణంగి; యేమంటే యేం చేస్తాం ?

2. అంటే మటుకు యేమంటాడేం? 'ఈ చీకట్లో యెక్కడికి వెళ్లారు?' అంటాడు; అంతేనా... ?

5. అన్నాడే అనుకో...భయమేముంది; చెప్పేద్దాం!

1. ఏమని... ?

[ కన్య లందరూ కిలకిల్లాడారు. వాళ్ల అభిప్రాయాలు అర్థం చేసుకున్నట్టు కృష్ణయ్య చిలిపిగా నవ్వాడు; తల పంకించాడు. అంతలో, వాళ్లు, అతని సమీపానికి వచ్చారు. ]

**కృష్ణయ్య:** ఊఁ...పూజ పూర్తి అయిందా ?

[ గోపికలు ఒకరి వంక ఒకరు ఆశ్చర్యంతో చూసుకున్నారు. ]

......మిమ్మల్నే...!

[ ఒక గోపిక 'ఆ' అన్నట్టుగా తల ఆడించింది. ]

కృష్ణయ్య: ...అమ్మవారు వరం యిచ్చిందా...?
...ఏమిటి...? ఇచ్చిందా...?

[ 'ఇతనికి అంతా తెలిసిందన్నమాట!' అన్నట్టుగా గోపికలు తలలు పంకించారు. ]

గోపిక: 4. ... ఆ...ఇచ్చింది!

[ మిగిలిన గోపికలు సిగ్గుతో కృంగిపోయినారు. ]

కృష్ణయ్య: ...అయితే చెప్పండి...! ఏమిటా వరం?
గోపిక: 5. ఏముంది? కొంటె కృష్ణయ్య...మాకు...మా కందరికీ...

3. (ఆమె నోరు మూస్తూ)
...అదే అదే...! 'యిక్కడ యిప్పుడే కనబడ తాడు' అని.

[ కృష్ణయ్య పక పక లాడాడు.
కన్యలు కిల కిల లాడారు. ]

కృష్ణయ్య: అయితే...పూజ ఫలించిం దన్నమాటే!
గోపిక: 5. ...ఆహా!

4. ఊఁ...దారిలో లే...మేం వెళ్లాలి!

కృష్ణయ్య: ...ఎక్కడికి?
గోపిక: 3. ఎక్కడి కేమిటి? మాకు యిళ్లూ వాకిళ్లూ లేవను కున్నావా?
కృష్ణయ్య: ఉంటే మాత్రం...? ...మీకు కావలసింది అక్కడే ముంది?

[ గోపికలు 'అదేమిటి' అన్నట్టుగా అతని వంక చూశారు. ]

కృష్ణయ్య: అఁహాఁహాఁ... ఏం లేదు! నేను, యిక్కడే ఉన్నా గదా అని!
గోపిక: 3. ఉంటే...? నిన్ను చూస్తూ కూర్చుంటామా?

[ గోపికలు ముసి ముసి నవ్వులు నవ్వుతున్నారు. ]

కృష్ణయ్య: ...అసలు మీ కోరిక అదేగా!

[ గోపికలు తిరిగి కిలకిల లాడారు. ]

ఔనా...కాదా...?

[ఓ పిల్ల 'కాద' న్నట్టు తల ఊపింది. ]

ఊఁ...! ఐతే ...మీరు నన్ను ఆడిస్తున్నా రన్న మాట!

ఊఁ...యిప్పుడు చెప్పండి!

"ఏ తరుణుడు మగడగుటకు
మీ తపములు చెప్పుడింక మీ యానలు సుం
డీ తప్పిన నీ కూరిమి
మీ తలలనె పుట్టె నోటు మేదినిలేదే!"

[ గోపికలు సిగ్గుతో తలలు వంచుకున్నారు. ]

"ఎవ్వని గని మోహించితి
రెవ్వడు మీ *మానసములనెల్ల* హరించెన్
నివ్వటిలు మీకు కూరిమి
యెవ్వనిపై పలుకరాదె యే సన్యుడనే?"

[ కన్య లందరూ అతని మాటలు విని అమితంగా సిగ్గుపడ్డారు; అక్కడ నుంచోలేక పోయినారు; అతణ్ణి తోసుకుని గబగబా ముందుకు వెళ్లిపోయినారు.

కృష్ణయ్యా వారివంక చూస్తూ ముసి ముసి నవ్వులు నవ్వు కున్నాడు. ]



## ★ 4. వ రంగం ★

[ ఒక కథకుడు శ్రీకృష్ణుని గురించి చెబుతున్నాడు. ]

**కథకుడు:** .:. శ్రీకృష్ణుడు సర్వాంతర్యామి. ఆయన లేని స్థలం లేదు; ఆయనకు తెలియని విషయ మంటూ ఉండదు.

అంతేకాదు; ఆయనే, అందరికీ ఆధారం కూడాను.

'తండ్రీ! నిన్నే నమ్ముకున్నాం; నువ్వే మాకు దిక్కు!' అని, యెవరైనా మనసారా అంటే చాలు, ఆయన వాళ్లను తన వాళ్లుగా భావిస్తాడు; యెంత సహాయమైనా చేస్తాడు.

ఆ విషయాన్నే, ఆయన, గోపికలకు తెలియ పరచాలనుకున్నాడు.

అంతలో ఓనాడు......



## ★ 5. వ, రంగం ★

[ గోప కన్యలు యమునా నదిలో జలకమాడుతున్నారు. వాళ్లు ఒకరి మీద ఒకరు నీళ్లు చిమ్ముకుంటున్నారు; కేరింతలు కొడుతున్నారు; పకపక లాడుతున్నారు.

అంతలో కృష్ణయ్య ఆ ప్రాంతాలకు వచ్చాడు; దూరాన ఉండే, గోపికలను చూశాడు; చూసి, పొదల మాటునా, చెట్ల చాటునా దాక్కుంటూ ఆ నదిని సమీపించాడు. అలా నదిని సమీపించిన కృష్ణయ్య, ఆ వెంటనే, ఆ ఒడ్డున ఉన్న చీరలన్నీ తీసుకుని భుజాన వేసుకున్నాడు. ఆ తరువాత, వేణువు నూదుతూ అక్కడినుంచి కదిలాడు.

వేణునాదం విన్న గోపికలు అటుగా చూశారు. అతణ్ణి చూడగానే వాళ్లకు యెక్కడలేని లజ్జా కలిగింది. వెంటనే వాళ్లు మెడలోతు నీటిలో మునిగి నుంచున్నారు ]

గోపిక: 1. అయ్యో అయ్యో...కృష్ణయ్యే...కృష్ణయ్య !!
2. ...ఇక్కడి కెప్పుడు వచ్చాడో...?
3. ఏమో...! ఇంతవరకు, మనం చూడనే లేదు!

[ అంతలో, కృష్ణయ్య, అక్కడే ఉన్న ఒక పొన్నచెట్టును సమీపించాడు. ]

గోపికలు: ( ఏక కంఠంతో )

అయ్యయ్యో...! కృష్ణా! కృష్ణా !!

" మామా వలువలు ముట్టకు
మామా కొనిపోకు పోకు మన్నింపు తగన్
మా మానమేల కొనియెదు
మా మానస హరణమేల మానుము కృష్ణా!"

[ వాళ్లు అలా బ్రతిమాలుతూ ఉండగానే, కృష్ణయ్య, పొన్న చెట్టు యెక్కి కూర్చున్నాడు. కన్య లందరూ అటే ఓరగా చూడసాగారు.

కృష్ణయ్య, వాళ్ళ వంక చిలిపిగా చూస్తూ తన దగ్గరకు రమ్మని తిరిగి సైగ చేశాడు. ]

కృష్ణయ్య: ...బృందా!

బృంద: అయ్యయ్యో! నన్ను గుర్తుపట్టాడే! ఎలా? ఏం చేసేది?

[ అంటూనే నీటిలో మునిగిపోయింది. ]

కృష్ణయ్య: ...బృందా! బృందా!!
...భేష్ భేష్...! బలే పనయింది!

[ బృంద, 'అమ్మ బాబోయ్' అంటూ, నీటిపైకి యెగిరింది. ]

గోపిక: 1. ...ఏమిటే...? ఏమయింది?

కృష్ణయ్య: ఏమీ లేదు. ఓ చేప పిల్లకి ఆవిడ కాలి చిటికెనవ్రేలు ముద్దొచ్చింది; అందుకనే, అది, మెల్లిగా ముద్దెట్టుకుంది

[ 'అది నిజమేనా?' అన్నట్టు గోపికలు బృంద వంక చూశారు. ఆమె 'ఔను' న్నట్టుగా తల ఆడించింది; సిగ్గుతో కృంగిపోయింది. ]

3. అది అతని కెలా తెలిసిందో?

[ కృష్ణయ్య మందహాసం చేశాడు. ]

1. ఉహుం! ఆయనకు తెలియం దేముంది?

4. ఇంతకూ... యిప్పుడేం చేద్దాం?

బృంద: ఏమీ లేదు. మనచీరలు మన కివ్వమని అడుగుదాం; అంతే!

గోపిక: 2. ఇవ్వమనగానే యిస్తాడా?

3. అదీ నిజమే. అసలే అల్లరివాడు...!

4. అందులోనూ మనమంటే అలుసెక్కువ కూడాను!

బృంద: అలాఅని ఊరుకుంటే యేమౌతుంది? అడిగిచూద్దాం!

[ కృష్ణయ్య వేణువు నూదుతున్నాడు. గోపిక లందరూ యేక కంఠంతో అతణ్ణి ప్రతిమాలటం మొదలుపెట్టారు ]

గోపికలు: కృష్ణా...!

"కొంటివి మా హృదయమ్ములు
కొంటివి మానంబు లజ్జగొంటివి వలువల్
గొంటి విక నెట్లు సేసెదొ
కొంటెవు గద నిన్ను నెరిగికొంటిమి కృష్ణా!"

కృష్ణయ్య: ( మందహాసం చేస్తూ )
రాధా! ను వ్వేమంటావ్ ?

రాధ: అనేందుకేముంది ? అందరితో బాటే నేనూను! మా చీరలు మా కివ్వమంటాను! అంతే!

కృష్ణయ్య: ( పక పకా నవ్వి )
అయితే, మీకు కావలసింది మీచీరలే అన్నమాట; అంతేనా ?

[ గోపికలు ఒకరి వంక ఒకరు చూసుకున్నారు. కృష్ణయ్యకు యేమని సమాధానమివ్వటానికీ వారికి పాలుపోలేదు. ]

గోపిక: 1. ...చూశావా...యెలా మాట్లాడుతున్నాడో ?

2. ఏంచేస్తాం......? ఆయన చేతుల్లో చిక్కాం; యేమన్నా పడాలిసిందే!

3. 'మాచీరలే మాకు కావాలి' అన్నామా...మళ్లీ, మనకు, మొహంకూడా చూపించడు!

4. అదీ నిజమే!

1. ఇతనితో పని యెప్పుడూ యింతే!

2. అందుకనే, బ్రతిమాలుకోవటం మంచిదనిపిస్తోంది! ఏమే బృందా...! ఏమంటావ్ ?

బృంద: ...సరే... కానివ్వండి!

గోపిక: 1. మాకే అది చేతైతే నిన్నడగటం దేనికి ?

[ బృంద కిలకిల లాడింది. ]

లొంగితే, ఆయన, నీకే లొంగాలి!

2. బ్రతిమాలినా బామాలినా నువ్వే!

[ గోపిక లందరూ ఆ మాటను సమర్థిస్తూ చిలిపిగా నవ్వారు; తల లూపారు.

బృంద, వారివంక ఓరగా చూసింది. ]

బృంద: ...కృష్ణా!

"మా వలువ లాగడంబున
నీ వేటికి బుచ్చుకొంటి నీ వల్పుడవే
నీ వెఱుగని దేమున్నది
నీ విందఱిలోన ధర్మనిరతుడవు గదే!"

[ కృష్ణయ్య: వేణువు నూదుతూ నిర్లక్ష్యంగా కూర్చున్నాడు. బృంద, తన స్నేహితురాండ్ర వంక ఒకసారి చూసింది; తిరిగి కృష్ణయ్య వంక చూసింది. ]

అయినా...కృష్ణా...!

"ఇంతుల్ తోయములాడుచుండ మగవా
రేతెంతురే, వచ్చిరా
యింతల్ సేయుదురే కృపారహితులై
యేలోక మందైన నీ
వింతల్ నీతల బుట్టె గాక మరియే
దీ కృష్ణ యోచెల్ల నీ
చెంతన్ దాసులమై చరించెదము మా
చేలంబు లిప్పింపవే!"

[ అది విన్న కృష్ణయ్య చిలిపిగా నవ్వాడు.
బృంద తిరిగి గోపికల వంక చూసింది.
ఆమె మాటలు సమర్థిస్తూ వారు తలలూపారు. ]

రాధ: ...నల్లనయ్యా!

“ వచ్చెదము నీవు పిలిచిన
నిచ్చెద మేమైన నీకు నెటు జోరు మనిన్
జొచ్చెదము నేడు వస్త్రము
లిచ్చి మముం గరుణతోడ నేలుము కృష్ణా!”

[ కృష్ణయ్య వారివంక చూసి చిరునవ్వు నవ్వాడు. ]

3. ఊఁహూఁ! మర్యాదగా అడిగితే యిచ్చేటట్టు లేదు.

[ ‘ ఓహో అలాగా ? ’ అన్నట్టు కృష్ణయ్య వాళ్లవంక చూశాడు; తల ఆడించాడు. ]

బృంద: కృష్ణా!...ఏమి టీ ఆగడం ?

“ రాజుల నెలుగవు బలిమిని
రాజిల్లెదు చీరలీవు రమణుల మింకన్
రాజున కెటిగించెదమో
రాజీవదళాక్ష నీవు రాజవె ధరకున్ ”

కృష్ణయ్య: ఊఁహూఁ! ఈ పప్పులు మనదగ్గర ఉడకవ్ !

“ నా యింటికి దాసులరై
నా యాజ్ఞవహించి మీరు నడిచెద రేనిన్
మీ యంబరంబు లిచ్చెద
దోయంబులు వెడలిరండు తొయ్యలులారా!”

గోపికలు: అయ్యయ్యో...ఇదే మన్యాయం ? అక్కడి కెలా వెడతాం ?

[ కృష్ణయ్య పకపకా నవ్వాడు. గోపికలు సిగ్గుతో కుంచుకు పోయినారు. ]

కృష్ణయ్య: ...ఇదంతా యెందుకొచ్చిన అల్లరి ? నా మాట విని, బయటికి రండి !

[ గోపికల ముఖాలు లజ్జతో జేవురించినై. ]
...వచ్చి, చేసినతప్పుకు చెంపలువేసుకోండి!

**గోపికలు:** ( ఒకరితో ఒకరు )
మనం చేసిన తప్పేముంది?

**బృంద:** ( మెల్లగా )
...ఆయన్ని బెదిరించాం కదూ; అదే అయి ఉంటుంది!

**కృష్ణయ్య:** ... ఆ తరువాత, మీ మనసులో ఉన్నమాటను, మెల్లిగా నాకు చెప్పుకోండి!

**గోపిక: 6.** ( మరొక గోపికతో )
... ఏమి టది?

**బృంద:** అదేనే ... అదే! "...నల్లనయ్యా...నువ్వే మా దేముడివి" అని మనవిచేసుకోవాలన్న మాట!

**కృష్ణయ్య:** ( చిరునవ్వుతో )
ఊఁ...అంతే! ఆ వెంటనే మీ చీరలు మీకు వచ్చేస్తై. తెలిసిందా..?

[ అది విన్న గోపికలు, గత్యంతరం లేదన్నట్టుగా తలలూపారు. కృష్ణయ్య, తన కేమీ పట్టనట్టుగా మురళి వాయిస్తూ కూర్చు న్నాడు. ]

**గోపికలు:** ( చేతులెత్తి నమస్కరిస్తూ )

" వాసుదేవ కృష్ణ వరద స్వతంత్ర వి
జ్ఞానమయ మహాత్మ సర్వపుణ్య
పురుష నిఖిలబీజ భూతాత్మక బ్రహ్మ
నీకు వందనంబు నిష్కలంక!"

[ అది విన్న కృష్ణయ్య మందహాసం చేశాడు. ఆ వెంటనే కృష్ణయ్య ఎవరి చీరలు వాళ్లమీదకు, విసిరి వేసాడు. గోపికలు ఆశ్చర్యంతో వాటిని అందుకున్నారు; మహదానం దాన్ని పొందారు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

1. కృష్ణయ్య
2. బలరాముడు
3. కొందరు మునులు,
   మునిపత్నులు,
   గోపకులు.



# గర్వభంగం

## ★ 1. వ రంగం ★

[ అదొక వనం. అందులో కొందరు మునులు బారులు తీరి కూర్చుని భోజనాలు చేస్తున్నారు.

అంతలో బయటనుంచి 'అయ్యా...ఓ...అయ్యా!' అన్న పిలుపు వారికి వినిపించింది. వారందరూ అటుగా చూశారు.

అంతవరకూ, అక్కడ అటూ యిటూ తిరుగుతూ యెవరికి యేమి కావాలో కనిపెడుతూ ఉన్న ఓ పెద్ద కూడా ఆ కేక విన్నాడు. విని, గబగబా బయటకు వెళ్లాడు. ]



## ★ 2. వ, ర ం గ ం ★

[ బయట, యిద్దరు గోపబాలురు నుంచున్నారు; లోపలకు చూస్తున్నారు. ]

గోపబాలుడు.

1. అయ్యా...! ఓ...అయ్యా...!!

[ అత డలా పిలుస్తూ ఉండగానే ఆ ముని అక్కడకు వచ్చాడు. వచ్చి, వాళ్లవంక యెగాదిగా చూశాడు. ]

ముని: ...ఏం...? ఎవరు మీరు?

గోపబాలుడు:

2. ( నమస్కరించి )

గొల్లలం బాబూ...! మాది బృందావనం!

ముని: ( నిర్లక్ష్యంగా )

...ఐతే...?

గోపబాలుడు:

1. ...గొడ్లను కాచుకోవటానికి యిలా వచ్చాం.

ముని: ( వికటంగా )

...మంచిపనిచేశారు...! మమ్మల్ని ఉద్ధరించారు!!

గోపబాలుడు:

1. ( కొంచెం చిన్నబుచ్చుకుని )

...అదంతా...ఆయన చేయాల్సిన పని బాబూ! మాకేం చేతౌతుంది?

ముని: ఓహోహో! భక్తిమార్గంలో పడ్డారే! ఇంతకూ ...ఆయన అంటే...

గోపబాలుడు:

2. ఆయనే బాబూ...ఆయనే! ఆ నల్లనయ్య!

1. ఆయనే మమ్మల్ని యిక్కడికి పంపించాడు!

ముని: ...ఓ...! ఎందుకో...?

గోపబాలుడు:

1. ఎందుకూ లేదు బాబూ...! మిమ్మల్ని అడిగి కొంచెం ప్రసాదం...

[ ఆ మాట విని, ముని పక పకా నవ్వాడు. ]

2. ఏం బాబూ...అలా నవ్వుతారు ?

1. ...మీ తెలివితేటలు చూసి...

[ అంటూనే అతను తిరిగి నవ్వాడు. గోపబాలురు ఆది అవమానంగా భావించి తలలు వంచుకున్నారు. ]

...పొండి పొండి! ఇక్కడ ప్రసాదం పెట్టేది మహానుభావులైన మహర్షులకే గాని గొడ్లను కాచుకునే గొల్లలకు కాదు.

గోపబాలుడు:

2. ( కొంచెం తీవ్రంగా )

మే మడిగేది కూడా మా కోసం కానే కాదు ; రామ కృష్ణులకోసం !

ముని: ( విరగబడి నవ్వుతూ )

ఓ హో! వాళ్లు గొల్లలు కారన్నమాట! వాళ్ల కేం కొమ్ములు మొలిచాయో...?

( వెక్కిరింతగా )

రామకృష్ణులుట...రా...మ...కృ...ష్ణులు! మహా మొనగాళ్లు బయలుదేరారు. ఉఁహుఁ! చెప్పుకోవటానికి సిగ్గన్నా లేదే! ఊఁ... పోతారా పోరా... ?

[ ముని అలా గర్జించగానే, గోపబాలురు, ముఖాలు చిన్నవి చేసుకుని అక్కడినుంచి బయలుదేరారు.

వెళ్లిపోతున్న వాళ్లనుచూసి, ముని, సగర్వంగా నవ్వుకున్నాడు.]



## ★ 3. వ, రంగం ★

[ అడవిలో ఒక చోట కొందరు గోపబాలురు కూర్చుని ఉన్నారు. వారి మధ్య బలరాముడూ కృష్ణుడూ ఉన్నారు. వాళ్లేవేవో కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారు. అంతలో సత్రానికి వెళ్లిన గోపబాలురు అక్కడికి వచ్చారు. వాళ్లను చూడగానే అక్కడి వాళ్లు నివ్వెర బోయినారు. ]

**గోపబాలుడు:**

3. అరుగో...మనవా ళ్లొచ్చారు; చేతులాడించు కుంటూ !

**బలరాముడు:** ( వచ్చినవారిని చూసి )

...ఏం...? పెట్టమన్నా రా ?

**గోపబాలుడు:**

2. పెట్టం ;అంటే బాధేముంది ? కొట్టినంత పని చేశారు !

**కృష్ణయ్య:** ఆఁ...! నిజంగానా...? ఐనా...మీారు యెవరి నడిగారు ?

**గోపబాలుడు:**

1. ఎవరో ఒకాయన... యింతలావూ అంత పొడుగూ ఉన్నాడు.

2. ఆ జడలూ ఆయనా అచ్చంగా మహర్షి మాదిరి గానేఉన్నాడు. మహర్షి గదా మర్యాదగామాట్లా డకపోతాడా అనుకున్నాం. కాని, ఆయన గుండె లో కోటి పులు లున్నాయని మాకేం తెలుసు ?

1. తెలియదు కాబట్టే ఆయన్ని అడిగాం !

[ అక్కడ ఉన్న గోపకులతో సహా కృష్ణ బలరాములు పకపకలాడారు. ]

**కృష్ణయ్య:** ఇంతకూ...

గోపబాలుడు:

1. ఏముంది...? మహానుభావులైతేనే అక్కడ ప్రసాదం పెడతారుట. మాబోటి వాళ్లకు పెట్టనే పెట్టరుట!

2. అలా అని ఊరుకుంటే అనుకోవలసిందేముంది? అనరానిమాటలు అనబట్టె...

[ అలా అంటూ ఉండగానే అతని కంటి వెంట నీరు కారింది; కృష్ణయ్య అది గ్రహించాడు. ]

కృష్ణయ్య: ఊఁ...! ఏమన్నాడేం...?

గోపబాలుడు:

2. "రాముడైతే మాకేం...కృష్ణుడైతే మాకేం; వాళ్ల కేమైనా కొమ్ములు మొలిచాయా?" అన్నాడు.

[ అది విన్న బలరామకృష్ణులు పకపకలాడిపోయినారు. ]

ఆ అనటంకూడా అతిహీనంగా అన్నాడు.

కృష్ణయ్య: ఊఁ ...అందుకని... ?

గోపబాలుడు:

4. ఏముంది...మనవాళ్లు గిఱ్ఱున తిరిగి చక్కా వచ్చారు!

[ గోపబాలురు కొందరు ఆ మాట విని నవ్వారు. ]

1. రాకపోతే, ఆయనవేసే కేకలకి గుండె పగిలి చచ్చేవాళ్లం; తెలుసా?

[ తిరిగి పిల్లలందరూ విరగబడి నవ్వారు. ]

కృష్ణయ్య: ఊఁ...! మరి మీకు ఆకలి కావటంలా?

గోపబాలుడు:

1. అవుతోంది. అయితేమాత్రం యేంచేస్తాం?

కృష్ణయ్య: చేసేదేముంది...మళ్లీ వెళ్లటమే...!

గోపబాలుడు:

2. అమ్మ బాబోయ్...అక్కడికే...?

కృష్ణయ్య: ( చిరునవ్వుతో )

ఆఁ...! ఈ మాటు వెళ్లి నా పేరెత్తకుండా మీ అంతట మీరే అడగండి! తెలిసిందా?

గోపబాలుడు:

1. ఎవరిని...? ఆ గడ్డపాయన్నా?

[ కొందరు పిల్లలు కిలకిల్లాడారు. ]

కృష్ణయ్య: అఁహాఁహాఁ...ఆయన్ని కాదు; అక్కడఉండే ఆడ వాళ్లని. వాళ్లు తప్పకుండా పెడతారు.

గోపబాలుడు:

2. ఊఁ...సరే...! అదీ చూస్తాంగా!

[ అలా అని తిరిగి ఆ బాలురు బయలుదేరారు. కృష్ణయ్య మాటల్లో ఉన్న భావం అర్థం కాక మిగిలిన గోపబాలురు ఒకరి వంక ఒకరు చూసుకున్నారు. బలరాముడు మాత్రం మందహాసం చేస్తూ కృష్ణయ్యవంక చూశాడు. ]



## ★ 4. వ, ర ం గ ం ★

[ వన భోజనాలు జరుగుతున్న చోటినుంచి యిద్దరు ముని పత్నులు బయటకు వస్తున్నారు. అదే సమయానికి గోప బాలురు ఆ ప్రాంతానికి వెళ్లారు.
గోపబాలురు దగ్గరవుతున్నకొద్దీ ఆ మునిపత్నులకు వేణునాదం దగ్గర దగ్గరగా వినపడసాగింది. వారు, అది విని, అదోవిధమైన ఆనందాన్ని అనుభవించ సాగారు; అనుకోకుండానే ఆగి పోయినారు. ]

మునిపత్ని: 1. ...అది...మురళీనాదం కదూ... ?
2. ఆఁ ఆఁ...అదే!
1. అయినా...కృష్ణయ్య కనబడటం లేదే...!
2. ...అదే విచిత్రంగా ఉంది!

[ అంతలో గోపబాలురు వారిని సమీపించారు; చేతులెత్తి నమ స్కరించారు. కాని, ఆ మునిపత్నులు వారిని గుర్తించే స్థితిలో లేరు. ]

గోపబాలుడు:
1. ...అమ్మా...!
[ ఆ మునిపత్నులు మరో ప్రపంచంలో ఉన్నట్టున్నారు. ]
2. ...అమ్మా...! అమ్మా...! మిమ్మల్నే...!!

[ అంతలో మురళీధ్వని ఆగిపోయింది. ఆ మునిపత్నులు తిరిగి మానవ ప్రపంచంలో పడ్డారు; నిట్టూర్చారు; గోపబాలురను చూశారు. ]

1. అమ్మా...!

మునిపత్ని: 2. ఎవరు నాయనా...మీరు ?

గోపబాలుడు:
1. గొల్లపిల్లల మమ్మా!

మునిపత్ని: 1. ( ఆనందంతో )
...గొల్లపిల్లలా...? అంటే...
2. వాళ్లే! నల్లనయ్య స్నేహితు లన్నమాట...!
1. ...అంతేనా బాబూ...?

గోపబాలుడు:
1. ఆఁ...ఔనమ్మా !

మునిపత్ని: 1. అయితే...కృష్ణయ్య కులాసాగా ఉన్నాడా నాయనా...?

[ గోపబాలురు ఒకరి వంక ఒకరు ఆశ్చర్యంతో చూసుకున్నారు. ]

గోపబాలుడు:
1. ఆ! ఆయనకేం...మహారాజల్లే ఉన్నాడు!

మునిపత్ని: 1. ( ప్రక్కనే ఉన్న ఆమెతో )
వింటున్నావా...? మన కృష్ణయ్య...మహారాజల్లే ఉన్నాడుట !
2. ( సంతోషంతో )
...ఉండకే మానాడు ? ఆయన అలా ఉండక పోతే మనం యిలా ఉండేవాళ్లమేనా ?
1. ( గోపబాలుర వంక చూసి )
...బాబూ...అక్కడికి, రాక్షసులింకా వస్తూనే ఉన్నారా ?

గోపబాలుడు:
1. ఓ...! గుంపులు గుంపులుగా వస్తున్నారు.
2. అయితేయేం ? వస్తున్నారు...ఆ వెంటనే చస్తున్నారు!

మునిపత్నులు: ( సంతోషంతో )
ఆహాహా...! కృష్ణా...! కృష్ణా!!

[ గోపబాలురు ఆదంతా విచిత్రంగా చూశారు. ]

గోపబాలుడు:
2. ...అమ్మా...!

**మునిపత్ని:** 1. ( ఒక బాలునితో )
...చూడు నాయనా...! నువ్వు ఆయన స్నేహితుడివే కదూ ?

**గోపబాలుడు:**
1. ఔనమ్మా...!

**మునిపత్ని:** 1. అయితే...యెప్పుడూ ఆయనతోనే ఉంటావన్న మాట !

**గోపబాలుడు:**
1. ఆఁ...యెప్పుడూను !

**మునిపత్ని:** 1. భలే భలే ! ఆయనతోనే ఉంటావు... ఆయనతోనే తింటావు. అంతేనా... ?

[ గోపబాలుడు 'ఔ' నన్నట్టు తల ఆడించాడు. ]

2. అంతేకాదు; ఆయన ప్రక్కనే ఉంటాడు, ఆయన ప్రక్కలోనే...

[ అలా అంటూనే ఆమె సిగ్గుపడ్డది. అలాగే తన్మయత్వాన్ని పొందింది. ]

**మునిపత్ని:** 1. ఇంతకూ మీరు యిక్కడి కెందు కొచ్చారు బాబూ ?

**గోపబాలుడు:**
2. ...ఆక లవుతుంటేను...!

**మునిపత్ని:** 1. అయ్యో...పాపం...! మరి, యింతసేపూ చెప్ప లేదేం నాయనా... ?

**గోపబాలుడు:**
2. ఆకలితోనే వచ్చామమ్మా...కాని...

**మునిపత్ని:** 2. మాటలమధ్య మరచిపోయినారు కాబోలు; పాపం!

**గోపబాలుడు:**
1. అఁహాఁహాఁ ! అదికాదు. ఏమిటో...! ఏమిటో...! మాకే తెలియకుండా ఉంది !
2. అసలు మా కిప్పుడు ఆకలే లేదు !

మునిపత్ని: 1. ఉఁహూఁ! అంతే నాయనా...అంతే! ఆయనమాట తలుచుకుంటే మీకే కాదు యెవరికైనా అంతే; అన్నం నీళ్లూ అక్కరలేదు !

2. అయినా తెస్తానుం డండి ; ఇప్పుడే తెస్తాను !

[ అంటూనే ఆవిడ గబగబా లోపలికి వెళ్లింది. ]

1. బాబూ...మీకు, పాలూ పెరుగూ యిష్టం కాదూ !

గోపబాలుడు:

ఆఁ...! చాలా యిష్టం !

మునిపత్ని: 1. ...పరమాన్నమో...?

గోపబాలుడు:

అదంటే, మాకు, ప్రాణం లేచొస్తుంది !

మునిపత్ని: 1. అయితే ఉండండి ; యిప్పుడే వస్తా !

[ అంటూ ఆమె లోపలికి వెళ్లింది. ]

గోపబాలుడు:

1. చూశావా.. ఆ గడ్డపాయనకూ వీళ్లకూ ఉన్న భేదం ?

2. ఉఁహూఁ...అంతేరా...యెప్పుడూఅంతే! అసలు విషయం తెలిసినవాళ్లు అణిగి మణిగే ఉంటారు !

1. ఇంకోటి. వీళ్లు మనమీదే యింత ప్రేమ చూపిస్తున్నారే...మన కృష్ణయ్య కనబడితే...

2. ఏముంది...? ప్రాణం యిచ్చేస్తారు !

1. ఇంకా సందేహమా...?

[ అంతలో లోపలినుంచి స్వయంగా రెండు కావళ్లు మోసుకుని మునిపత్నులు బయటకు వచ్చారు. వాళ్లను చూడగానే గోపబాలురు ఆశ్చర్యపడ్డారు. ]

మునిపత్ని: 1. ( కావళ్లు దింపి )

...బాబూ...యివుగో...! పాలూ, పెరుగూ, అన్నం పరమాన్నం...అన్నీ తెచ్చాం!

గోపబాలుడు: ( ఆశ్చర్యంతో )
...ఇవన్నీ దేనికి ?

మునిపత్ని: 1. అదేమిటి నాయనా! కడుపునిండా తినాలా వద్దా? కావలసింది కమ్మగా తినండి; త్రాగండి! అప్పటికీ యేమన్నా మిగిలితే, 'కృష్ణార్పణం' అంటూ,ఆయన అభిమానించే ఆవులూ దూడలూ ఉన్నయ్యే...వాటికి పెట్టండి! ఏం నాయనా... పెడతారుగా?

[ ఆ మాట అంటూ ఉండగానే మునిపత్నుల కళ్లల్లో నీళ్లు తిరిగినై. ]

గోపబాలుడు:
1. అయ్యయ్యో...అదేమిటి?

మునిపత్ని: 2. ఏం లేదు నాయనా...యేం లేదు! ఆ కృష్ణయ్యను కళ్లారా చూసే అదృష్టం మాకు లేదే అని; అంతే!

[ కన్నీళ్లు చీరచెంగుతో తుడుచుకుంది. ]

గోపబాలుడు:
2. అదేమిటి...? ఎందుకు లేదు?

మునిపత్ని: 2. ఏంచెప్పేది నాయనా...? కంస మహారాజు అలా శాసించాడు; యేంచేస్తాం?

గోపబాలుడు:
2. ...ఓ! అదా సంగతి?

మునిపత్ని: 1. ఔను బాబూ! మందవేపుకు వెడితే మా ప్రాణాలు మావికావు; అదీ మా బ్రతుకు!
2. అందుకనేగా యిన్నాళ్లూ కళ్లు కట్టేసుకుని కూర్చున్నాం!

గోపబాలుడు:
1. ఊం...! మీరు అక్కడకు వెళ్లటమే తప్పన్న మాట?

మునిపత్ని: 2. అంతే నాయనా...అంతే!

గోపబాలుడు:

1. సరి. ఆయనే యిక్కడికి వచ్చాడనుకుందాం ; అప్పుడయినా చూడచ్చా ?
2. ఏమో...అదీ చెప్పలేం ! 'కృష్ణయ్య వస్తున్నాడు; అందరూ కళ్లుమూసుకోండి' అని ఆ మహారాజు ఆజ్ఞాపిస్తే, అప్పుడు మాత్రం చేసే దేముంది ?
2. అదీ నిజమే...కాని, వీళ్లు కళ్లు మూసుకున్నా ఆయన వీళ్లకు కనబడ్డాడనుకో... ! అప్పు డేమౌతుంది...... ?

మునిపత్నులు:

మాకు అంతటి అదృష్టం కూడానా బాబూ...

[ అలా వాళ్లు బాధపడుతూ ఉండగానే తిరిగి మురళీనాదం వినిపించింది. మునిపత్నులు 'కృష్ణా ! కృష్ణా !' అని, ఒళ్లు మరచి పిలువసాగారు ; అదే పనిగా నృత్యం చేయటం మొదలు పెట్టారు.

అంతలో కృష్ణయ్య అక్కడకు వచ్చాడు. వచ్చి, వేణువు నూదుతూ వారి చుట్టూ తిరుగసాగాడు. అది చూసిన గోపబాలురు ఆశ్చర్యంతో ఒకరి వంక ఒకరు చూసుకున్నారు.

కొంతసేపు అలా గడిచింది. కృష్ణయ్య వేణువు నూదటం ఆపాడు. ఆపి, అక్కడే ఉన్న కుండలన్నీ పరీక్షగా చూసి, ప్రతి పాత్రలోనుంచీ కొద్దో గొప్పో తీసుకు తిన్నాడు. పరమాన్నం కనబడగానే ప్రాణం లేచివచ్చినట్టు అక్కడే ఆగాడు. ఆగి, వెంటనే దాన్ని దోసిళ్లతో తీసుకుని జుర్రుకోవటం మొదలు పెట్టాడు.

ముని పత్నులు కొంతసేపు అలా తన్మయావస్థలో ఉండిపోయి తరువాత కళ్లు తెరిచారు ; తమ యెదుట ఉన్న కృష్ణయ్యను చూశారు. చూసి, 'కృష్ణా ! కృష్ణా ! అంటూ అతణ్ణి కౌగిలించుకున్నారు. ]

కృష్ణయ్య: ...అరెరె...నా నోటికి అడ్డొస్తారేమిటి?

[ అంటూనే, పరమాన్నం కుండలోకి చేయి పోనిచ్చాడు. అది చూసిన మునిపత్నులు అతని వంక ఆశ్చర్యంతో చూశారు. ]

మునిపత్ని: 1.

...చూశావా...మన చిన్నారికి యెంత ఆకలవుతోందో! ఏదీ...ఆ పరమాన్నం కుండ యిలా యియ్యి!

[ ఆ మాట విన్న మునిపత్ని 2. ఆ కుండలోకి చూసింది. అది ఖాళీగా ఉండటంవల్ల మరో కుండలోంచి రెండు గిన్నెల నిండా పరమాన్నం తీసి ఆమెకు యిచ్చింది. మునిపత్ని. 1. దాన్ని కృష్ణయ్య నోటికి అందించింది.

కృష్ణయ్య ఆ గిన్నెలో ఉన్న పరమాన్నం అంతా ఒక్క గుక్కలో పీల్చేశాడు. ఆ వెంటనే ఆ కుండను తన దగ్గరగా లాక్కున్నాడు. తిరిగి దోసిళ్లతో జుర్రుకోసాగాడు.

అది చూసిన మునిపత్నులు అమితంగా ఆనందించారు; ఆశ్చర్య పడ్డారు. అంతలో కృష్ణయ్య కడుపునిండినట్టుగా త్రేన్చాడు. ]

కృష్ణయ్య: చాలా బాగుందమ్మా...పరమాన్నం చాలా బాగుంది! అదే కాదు; అన్నీ బాగానే ఉన్నై.

ఊఁ...యిప్పుడు చెప్పండి. మీరందరూ కులాసాగా ఉన్నారా?

మునిపత్నులు:

ఆహా...! నీ దయవల్ల!

కృష్ణయ్య: ...ఇహ మీకు కావలసిందేముంది?

మునిపత్నులు:

లేకేం నాయనా...ఉంది; ఒకే ఒక తీరని కోరిక ఉంది

కృష్ణయ్య: ఏమిటది?

మునిపత్నులు:

...ఏమీ లేదు; 'మా కన్నారి మావాడు' అనుకునే శక్తి మాకు కావాలి! మా కృష్ణయ్య యెప్పుడూ మా కళ్లముందు మసలుతూ ఉండాలి; అంతే!

కృష్ణయ్య: ( వెఱ్ఱిగా నవ్వి )

అయ్యయ్యయ్యో...అదేమిటి? మీ క్షేమైనా పిచ్చెక్కిందా? ఇచ్చేవాళ్లున్నప్పుడు యిల్లో, వాకిల్లో, నగలో నాణాలో అడగాలి గాని, యిలా వెఱ్ఱి మొఱ్ఱి వరాలు అడుగుతారా? అయినా నేను కనబడితే మీ కడుపేం నిండుతుంది?

[ ఆ మాట విన్న మునిపత్నులు 'నాయనా...! కృష్ణా!' అంటూ అతణ్ణి హృదయాలకు హత్తుకున్నారు. కృష్ణయ్య మందహాసం చేస్తూ వాళ్లవంక సానుభూతితో చూశాడు. అంతలో పెనుచీకటి వారిని కప్పేసింది. ఆ చీకటి తెర తొలగిపోయేటప్పటికి అక్కడ కృష్ణయ్య లేడు. మునిపత్నులు మాత్రం కృష్ణయ్యను కావిలించుకున్నట్టుగా మోకాళ్లమీద కూర్చుని ఉన్నారు. వారి ముందు గోపబాలురు నుంచుని ఉన్నారు.

మొదట్లో గోపబాలురను తరిమి పంపిన ముని, అంతలో అక్కడకు వచ్చాడు. వచ్చి, ఆ కావిళ్లనూ, ఖాళీ అయి ఉన్న కుండలనూ చూశాడు. చూసి, నివ్వెరబోయి నిలబడ్డాడు. అదే సమయానికి మునిపత్నులు కళ్లు తెరిచారు. ]

ముని: ( 1. వ, మునిపత్ని నుద్దేశించి )

...సుమతీ! ఏమి టిదంతా?

మునిపత్ని: 1. ( కలవర పడుతూ )

...ఏ ముంది? ...ఏమీ లేదు!

ముని: ఊఁ! ఇవన్నీ తెచ్చి వీళ్లకు పెట్టా రన్నమాట!

మునిపత్ని: 2. ఉఁహూఁహూఁ...కాదు కాదు...
ముని: మరే మిటి...?
గోపబాలుడు: 1.
అదేమిటి బాబూ...అంత కోపం దేనికి?
ముని: (వాళ్లవంక చురచురా చూస్తూ)
ఉఁహూఁ! మిమ్మల్ని యేం చేసినా పాపంలేదు!
మునిపత్ని: 1. పాపం...వాళ్లేం చేశారు? ఇవి తెచ్చి పెట్టింది మేము...వచ్చి తిన్నది కృష్ణయ్య; యిందులో వీళ్ల తప్పేముంది?
ముని: ...కృష్ణయ్యా?
మునిపత్ని: ఆఁ...ఆయనే! ఆయనే వచ్చాడు! ఎంత బాగున్నాడో తెలుసా?
1. ఎంత బాగున్నాడో అంత మంచివాడు కూడాను!
ముని: ...కృ...ష్ణ...య్య...! కృ...ష్ణ...య్య...!! కృ...ష్ణ...య్య...! !!

[ అత డలా అంటూ ఉండగానే అతని చెక్కిళ్లవెంట నీరు ధారగా కారింది. అంతలోనే అతను కళ్లు మూసుకున్నాడు; "కృష్ణా...! కృష్ణా!" అంటూ కృంగిపోయినాడు; భక్తితో చేతులు జోడించాడు. ]

ఉఁహూఁ...!
"జపహోమా ధ్యయనంబులు
దపములు వ్రతములును లేని తరుణులు హరి స
త్కృప బడసి రన్నిగలిగియు
జపలత బొందితిమి భక్తి సలుపమి నకటా!"

[ అత డలా పశ్చాత్తాప పడుతూ ఉండగానే మరికొందరు మునులు అక్కడికి వచ్చారు. విషయమంతా గ్రహించుకున్నారు. అందరూ పరమాత్మునికి అంజలించారు. ]

**మునులు:**

“ క్రతువుల్ ధర్మము మంత్ర తంత్ర ధనముల్
కాలంబు దేశంబు దే
వతయున్ వహ్నులు మేదినీ సురులు నె
వ్వా డట్టి సర్వేశు డీ
క్షితి రక్షింప జనించి నా డెరుగ మా
శ్రీ భర్తకుం గర్తకుం
గుతలో ద్ధర్తకు మేము మ్రొక్కెదము ర
క్షో నాథ సంహర్తకున్ ”

[ వాళ్లు అలా ప్రార్థిస్తూ ఉండగానే తిరిగి మురళీనాదం వినిపించింది. మునిపత్నులూ, మునులూ, గోపబాలురూ అదో విధమైన ఉద్రేకంతో నృత్యం చేయసాగారు. ]

**అందరూ:** “ హరే రామ హరే రామ
రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ
కృష్ణ కృష్ణ హరే హరే ! ”



## ★ ముఖ్యపాత్రలు ★

1. కృష్ణయ్య
2. బలరాముడు
3. నందుడు
4. ఉపనందుడు
5. ఇంద్రుడు
6. నారదుడు



# గోవర్ధనోద్ధారణం

## ★ 1. వ, రంగం ★

[ అది నందగోపుని యిల్లు. ఆ యింటి ముందు ఒకప్రక్క బల్లా, మరొక ప్రక్క కావిళ్లూ ఉన్నై.

బల్లనిండా రకరకాల పళ్లూ కూరగాయలూ ఉన్నై. పాలూ, పెరుగూ, వెన్నా, నెయ్యీ మొదలైన పదార్థా లన్నీ కావిళ్లకెత్తి ఉన్నై.

ఆ ప్రదేశ మంతా యిసుక వేస్తే రాలనట్టుగా ఉంది. అక్కడున్న జనం, ఆబాల గోపాలం యేదో మహోత్సవానికి తరలి వెడుతున్నట్టుగా ఉన్నారు.

అక్కడే ఒక ప్రక్కగా నుంచుని కృష్ణ బలరాములు అదంతా వింతగా చూస్తున్నారు. అంతలో నందుడూ ఉపనందుడూ యేదో ఆలోచిస్తూ అటుగా వచ్చారు. కృష్ణయ్య వాళ్లను సమీపించాడు. ]

**కృష్ణయ్య:** నాన్నగారూ... యేమి టిదంతా ?

**నందుడు:** ...మనం యిప్పుడు యింద్రయాగం చెయ్యబోతున్నాం కదూ ! అందుకే !

**కృష్ణయ్య:** ఇంద్రయాగమా ? దేనికి ?

**నందుడు:** మేఘాల రాజైన యింద్రుడు మెచ్చుకునేందుకు నాయనా !

**ఉపనందుడు:**

ఆఁ ఆఁ...అంతే... !

" మఖముసేయ వజ్రి మది సంతసించును
వజ్రి సంతసింప వాన గురియు

వాన గురియ గసవు వసుమతి బెరుగును
గసవు మేసి ధేను గణము బ్రదుకు"

**నందుడు:** ...అంతేకాదు.

"ధేనువులు బ్రదికె నేనియు
మానదు ఘన మైన పాడి మందల గలుగున్
మానుగను బాడి గలిగిన
మానవులును సురలు దనిసి మనుదురు పుత్రా!"

[ ఆ మాటలు విని కృష్ణయ్య విరగబడి నవ్వాడు. ఆ దేమిటో అర్థం కాక నందుడూ ఉపనందుడూ అతని వంక చూశారు. ]

**ఉపనందుడు:**

...అదేమిటి? అలానవ్వితే ఆయనకు కోపంరాదూ?

**కృష్ణయ్య:** ఎవరికి...? ఇంద్రుడికా?

[ అలా ప్రశ్నిస్తూనే కృష్ణయ్య తిరిగి నవ్వాడు. అది చూసిన నందుడూ ఉపనందుడూ తెల్లబోయినారు; ఒకరి వంక ఒకరు చూసుకున్నారు. ]

ఉఁహూఁ! కోపం వస్తుందిట కోపం! వస్తే యేం చేస్తాడు? ఉన్న ఉద్యోగం వదిలి వెళ్లి పోతాడు; అంతేనా?

**నందుడు:** కృష్ణా...! ఏమిటీ అల్లరి?

**కృష్ణయ్య:** (ఉపనందుడూ మొదలైనవాళ్లను చూపుతూ)
అల్లరిచేసేది నేనుకాదు నాన్నగారూ; వీళ్లు. అసలు విషయమేమిటో తెలియదు; హడావుడి చూద్దామా అమితం!

[ అంతే అన్నట్టుగా బలరాముడు తల ఆడించాడు. ]

"కర్మమున బుట్టు జంతువు
కర్మముననె వృద్ధిబొందు గర్మమున జెడుం

గర్మమె జనులకు దేవత
కర్మమె సుఖ దుఃఖములకు, *కారణ మిలపై ”

ఇప్పుడు చెప్పండి; యింద్రుడు చేసే పనేమిటో!

[ నందుడు ఉపనందుని వంక చూశాడు; 'దీనికేమి సమాధానం చెబుతాం' అన్నట్టుగా. ]

లేదు...; చేసేపని ఉన్నా లేకపోయినా, ఆయన పెద్దరికం ఆయనదే అనుకుందాం. ఆయనకు మన మీద కోపం వచ్చిందే అనుకుందాం. అప్పుడు మాత్రం మనకు పోయేదేముంది?

**ఉపనందుడు:**

ఏమో...యేం చెబుతాం?

**కృష్ణయ్య:** అలాకాదు. మన కేదైనా ఉంటే, పోతుందని భయపడాలి. అసలు మన కున్న దేమిటి? ఇళ్లా, వాకిళ్లా మడి మన్యాలా యేమున్నాయని? అడవుల్లో ఉంటున్నాం; ఆవులను కాచుకుంటున్నాం; అంతేగా; అంతకు మించిన అదృష్టం మనకు లేనూ లేదు; అంతకు మించిన కష్టం ఆయన కలిగించనూ లేదు.

[ కృష్ణయ్య చెప్పేదంతా తనకు నచ్చినట్టు నందుడు తల పంకించాడు. ]

**ఉపనందుడు:**

అయితే యిప్పుడు యేం చెయ్యమంటావ్?

**కృష్ణయ్య:** ఏముంది...? చేసే ప్రయత్నాలు చెయ్యనేచేశారు; ఇక ఆపేదేముంది! ఆగేదేముంది? కాక బోతే...

**ఉపనందుడు:**

...ఏమిటది?

కృష్ణయ్య: ఏమీ లేదు, పశువులకూ, పర్వతాలకూ, పూజ చేయటం చాలా మంచిది. మనం అనుకున్న సమయానికి అనుకున్న చోటికే వెడదాం. వెళ్ళి, ఆ యింద్రుడికి కాకుండా యే కొండకైనా సరే పూజచేద్దాం. అక్కడ కనపడ్డ ప్రాణికల్లా కడుపు నిండా అన్నం పెడదాం. అంతే. అదేమనకు యెంతైనా మేలుచేస్తుంది.

ఉపనందుడు:

నిజమే. భూతశాంతిని మించింది భూలోకంలో యేముంది ?

కృష్ణయ్య: నాకు ధర్మమని తోచిందేదో నేను చెప్పాను; ఇక మీ యిష్టం ?

నందుడు: బాగుంది నాయనా...! నువ్వు చెప్పింది చాలా బాగుంది ! అలాగే చేద్దాం !

కృష్ణయ్య: అయితే ఆలశ్యం దేనికి ? బయలుదేరండి !

[ నందుడూ ఉపనందుడూ ఒకరి వంక ఒకరు అదో విధంగా చూసుకున్నారు ; అక్కడినుంచి కదిలారు.
కృష్ణయ్య బలరాముని వంక చూసి చిలిపిగా నవ్వాడు. ]

బలరాముడు:

...మళ్ళీ యేదో తలపెట్టావు !

కృష్ణయ్య: ఏమీ లేదు. దీంతో ఆ యింద్రుడి గర్వం పూర్తిగా దిగిపోతుంది. అదీ...మనం కోరేది !

[ 'ఊఁ...చాలా బాగుంది' అన్నట్టుగా తల ఆడిస్తూ బలరాముడు కృష్ణయ్యవంక చూశాడు.
ఆ వెంటనే, కృష్ణయ్య, బలరామునితో చేయి కలిపి, కులుకుతూ అక్కడినుంచి కదిలి వెళ్ళాడు. ]



## ★ 2. వ రంగం ★

[ ఒక కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు:** ...కృష్ణయ్య చెప్పిన మాటలు గోపకు లందరకూ నచ్చినై. పర్వతానికి పూజ చేయటానికే వాళ్లు నిశ్చయించుకున్నారు. అదే ప్రయత్నంలో ఊరి బయటకు వెళ్లారు.

ఆ వెంటనే, చిన్ని కృష్ణయ్య, అక్కడ ఒక కొండను కల్పించాడు. గోపకు లందరితోనూ కలసి తనుకూడా ఆ కొండకు పూజ చేశాడు.

ఆ తరువాత గోపకుమారులూ గోపికలూ అందరూ కలిసి శ్రీకృష్ణుని ప్రశంసిస్తూ పాటలు పాడారు; ఆట లాడారు. అలా ఆ రోజంతా, వాళ్లకు పండువుగా గడిచిపోయింది.



## ★ 3. వ, రంగం ★

[ ఇంద్రుడు తన ఆలోచనామందిరంలో అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు. అతనిలో యేదో అమితమైన ఆవేదన కనబడుతోంది. ]

**ఇంద్రుడు:** ...ఊఁహూఁ! నల్లనయ్య చెప్పాడుట ... గొల్ల లందరూ చేశారుట. ఎంత గర్వం...? ఎంత నిర్లక్ష్యం?

"గురుదేవ హీను బాలుని
గిరిభూజ ప్రముఖ వాసు గృష్ణు ననీశుం
బరిణామశీలు గుల గుణ
విరహితు జేపట్టి యింద్రు విడిచిరి గొల్లల్"

...ఇది నా యింద్రపదవికే అవమానం! దీనికి తగిన ప్రతీకారం చేసి తీరాలిసిందే!

( ఓ ప్రక్కకు చూసి )

... పర్జన్యా... !

[ పర్జన్యుడు ముందుకు వచ్చి, చేతులు కట్టుకుని నుంచున్నాడు. ]

"ఉద్యత్సంపద నమ్మి నందతనయో
ద్యోగంబునన్ వెఱ్ఱులై
మ ద్యాగంబు వి సర్జనీయమని రీ
మర్త్యుల్ వడిన్ మీరు మీ
విద్యుద్వల్లుల గప్పి గర్జనములన్
వేధించి గోవుల్ జనుల్
సద్యో మృత్యువు బొంద ఱాల్ గురియుడీ
శౌర్యం బవార్యంబుగన్"

ఊఁ...వెళ్లండి! వెంటనే వెళ్లండి!!

"మీ వెంట వత్తు నే నై
రావత నాగంబునెక్కి రయమొప్పంగా
దేవ గణంబుల తోడను
గోవిందుని మంద లెల్ల గొందలపెట్టన్"

పర్జన్యుడు: ... చిత్తం!

[ పర్జన్యుడు కదిలి వెళ్లాడు. ఇంద్రుడు వికటాట్టహాసం చేస్తూ మరొక దిక్కుగా కదిలాడు. ]



## ★ 4. వ, రంగం ★

[ ఊరి బయట, ఒక చెట్టు క్రింద కూర్చుని కృష్ణయ్య మురళి వాయిస్తున్నాడు. బలరాముడూ, కొందరు గోపబాలురూ అతని చుట్టూ కూర్చున్నారు; అందరూ అదో విధమైన ఆనందాన్ని అనుభవిస్తున్నారు.

అంతలో మందవేపు నుంచి అలజడి వినిపించింది. కృష్ణ బలరాములు అటుగా చూశారు. వాళ్లకు మెఱుపులు కనిపించినై. ఉరుములు వినిపించినై. అక్కడ పిడుగులు పడుతున్నాయనీ, రాళ్లవర్షం కురుస్తున్నదనీ కూడా వారికి అనిపించింది. ]

**దూరపుగొంతులు:**

"ఈ యుఱుములు నీ మెఱుములు
నీ యశని విఘోషణములు నీ జలధారల్
నీ యాన దొల్లి యెఱుగము
కాయాలింపం గదయ్య గుణ రత్న నిధీ"

[ అది వినగానే, కృష్ణయ్య ఆవేదనతో లేచి నుంచున్నాడు. ఆ వెంటనే అటు దిక్కుగా పరిగెత్తాడు. ]



## ★ 5. వ, రంగం ★

[ అది వనంలో ఒక భాగం. "కృష్ణా.. ! కృష్ణా... !!" అని
అరుస్తూ ఉపనందుడు ప్రవేశించాడు.
అంతలో కృష్ణయ్య అతనికి యెదురైనాడు. ]

**కృష్ణయ్య:** ...ఏమయింది తాతా ?

**ఉపనందుడు:**

నాయనా...!

"అక్కట వానదోగి వ్రజ
మాకుల మయ్యె గదయ్య కృష్ణ నీ
వెక్కడనుంటి వింతదడ
వేల సహించితి నీ పదాబ్జముల్
దిక్కుగ నున్న గోపకులు
దీనత నొంద భయాపహారివై
గ్రక్కున గావ కిట్లునికి
కారుణికోత్తమ నీకు బాడియే ?"

**కృష్ణయ్య:** ( ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ, తనలో... )
...ఊఁ...! ఇంద్రుడు రంగంలోకి యిప్పుడు దిగా
డన్నమాట ?

" తన్నొక యింత గైకొనరు
తప్పిరి యాగముచేసి రంచు దా
మిన్నున నుండి గోపకుల
మీద శిలల్ గురియించుచున్న వా
డున్నత నిర్జరేంద్ర విభ
వోత్థిత గర్వనగాధిరూఢుడై
కన్నులగాన డింద్రు డిటు
గర్వపరుం డొరు గాన నేర్చునే ?"

( దూరానికి చూసి... )

...అయ్యయ్యో...! మంద అంతా అల్లకల్లోలమై పోయిందే!

ఊఁ...! సరి...!! అతనికి తగిన శాస్తి చేస్తాను. మందలో ఉన్నవాళ్లు మానవ మాత్రులు కారని అతను గ్రహించేటట్లు చేస్తాను.

( దూరాన ఉన్న తన వారి నుద్దేశించి )

" కలగకుడీ వధూజనులు
కంపమునొందకుడీ వ్రజేశ్వరుల్
తలగకుడీ కుమారకులు
తక్కినవారలు ఈల వానచే
నలగకుడీ పశువ్రజము
నక్కడ నక్కడ నిల్వనీకుడీ
మెలపున మీకు నీశ్వరుడు
మేలొసగుం గరుణార్ద్ర చిత్తుడై "

[ అలా వాళ్లని హెచ్చరిస్తూ కృష్ణయ్య ఆటుగా పరిగెత్తాడు. ]



## ★ 6. వ, రంగం ★

[ బృందావనంలో ఉన్న జనం ఆ బాలగోపాలం అటూ యిటూ పరిగెత్తు తున్నారు. ఆవులూ, దూడలూ అమితమైన భీతితో అంభారావాలుచేస్తున్నై. అక్కడ యెవరి ముఖాన చూసినా ఆందోళన మాత్రమే కనబడుతోంది. అక్కడ మెరిసే మెఱుపులకూ, ఉరిమే ఉరుములకూ అంతులేదా అనిపిస్తోంది.

అంతలో దూరం నుంచి మురళీనాదం వినిపించింది. గోపికలూ, గోపకులూ, తదితరులూ కూడా, ఆ నాదం విని, అది వస్తున్న వేపుగా పరిగెత్తారు. ]



## ★ 7. వ, రంగం ★

[ కృష్ణయ్య, గోవర్ధన పర్వతాన్ని ఒక వేలిమీద యెత్తి, గొడుగు మాదిరి పట్టుకుని నుంచున్నాడు. దూరాన ఉన్న తన వారిని పిలుస్తున్నాడు. ]

**కృష్ణయ్య:**

" రా తల్లి రమ్ము తండ్రీ
ప్రేతలు గోపకులు రండు విను డీ కర్త
క్ష్మాతలమున నుండుడు గో
వ్రాతముతో మీరు మీకు వలసిన యెడలన్ "

[ మంద అంతా కృష్ణయ్యను సమీపించింది. ]

**గోపకులు:** ఇదేమిటి ? ఈ కొండ క్రింద యెలా నుంచునేది ?

**కృష్ణయ్య:** ( చిరునవ్వుతో )

" బాలుం డీతడు కొండ దొడ్డది మహా
భారంబు సైరింపగా
జాలండోయని దీని క్రింద నిలువన్
శంకింపగా బోల దీ
శైలాంభోనిధి జంతు సంయుత ధరా
చక్రంబు పైబడ్డ నా
కే లల్లాడదు బంధులార నిలు డీ
క్రిందం బ్రమోదంబునన్ "

[ అది విన్న గోపకుమారులు 'శ్రీ కృష్ణపరమాత్మకూ జై' అన్న నినాదం చేశారు.



## ★ 8. వ రంగం ★

[ ఇంద్రుడు అశాంతితో ఆటూ యిటూ తిరుగుతున్నాడు.
పరిచారికలు అతనికి వింజామరలు వీస్తున్నారు.
అంతలో నారదుడు ప్రవేశించాడు. ]

**నారదుడు:** ...హరే కృష్ణ హరే కృష్ణ
కృష్ణ కృష్ణ హరే హరే!

[ ఇంద్రుడు నారదుని వంక చూశాడు. నారదుడు అతణ్ణి సమీపించాడు. ]

**ఇంద్రుడు:** ...మందలోగాలి మహర్షులకు కూడా సోకినట్టుందే!

**నారదుడు:** ...అదేమిటి ?

**ఇంద్రుడు:** ( వికటంగా )
...ఏముంది...? ఆ నల్లనయ్య నారాయణుడను కోవటమే!

**నారదుడు:** ( వికటంగా నవ్వి )
ఓ...అదా ? ఇంకా మీకు ఆ సందేహం తీరలేదన్న మాట! ... అయినా సురాధిపా! ఆ నల్లనయ్యే నారాయణుడు కాకపోతే మీ ఆగ్రహానికి ఆమంద యెప్పుడో ఆహుతి అయిపోయేది కదూ ?

[ ఇంద్రుడు లజ్జతో తల వంచుకున్నాడు. ]

ఆయన లీలలు కళ్లారా చూస్తూ కూడా మీ రిలా మాయలో మునిగిపోవటమా ?

**ఇంద్రుడు:** ...లీలలా...?

**నారదుడు:** ఆఁ...అవే! అవేవీ అల్పమైనవి కూడా కావే!

"కన్నులు దెఱవని కడు జిన్నిపాపడై
దానవి చనుబాలు ద్రావి చంపె
మూడవ నెల నాడు ముద్దుల బాలుడై
కోపించి శకటంబు గూలదన్నె

నేడాది కుఱ్ఱడై యెగసి తృణావర్తు
మెడ బట్టుకుని కూల్చి మృతుని జేసె
దల్లి వెన్నలకునై తను ఱోల గట్టిన
గోమరుడై మద్దుల గూలనీడ్చె
బసులగ్రేపుల గాచుచు బకుని జీరె
వెలగతో వత్సదైత్యుని వ్రేసిగెడపె
సబలుడై ఖరదైత్యుని సంహరించె
నితడు కేవల మనుజుడే యెంచిచూడ"

...ఇవే కాదు; యిటు వంటివి యింకా యెన్నో ఉన్నై.

[ నారదుడు చెప్పేదంతా ఇంద్రుడు అతి శ్రద్ధగా విన్నాడు. విని, కృష్ణయ్యమీద అదో విధమైన గౌరవభావాన్ని కుదుర్చుకున్నాడు. ఆవెంటనే ప్రక్కకు చూశాడు. పర్జన్యుడు, గౌరవ పూర్వకంగా, వచ్చి అతని ముందు నుంచున్నాడు.]

**ఇంద్రుడు:** ...వెంటనే సైన్యాన్ని ఉపసంహరించుకోవాలి! ...వింటున్నావా?

[ పర్జన్యుడు అది ఆజ్ఞగా స్వీకరించి, అక్కడినుంచి కదిలి వెళ్లాడు. నారదుడు, ఇంద్రుని చూసి, మందహాసం చేశాడు. ]

**నారదుడు:** ...నారాయణ...! నారాయణ...!!

[ అనుకోకుండానే ఆ పరమాత్ముని తలచుకుని, ఇంద్రుడు, ఐదు పది చేశాడు. ]



## ★ 9. వ, రంగం ★

[ కృష్ణయ్య గోవర్ధన పర్వతాన్ని యెత్తి పట్టుకుని నుంచున్నాడు. మందలోని ఆబాలగోపాలం దానిక్రింద ఉన్నారు. అందరూ భజన చేస్తున్నారు. అంతలో, మెఱుములూ ఉఱుములూ ఆగిపోయినై.

కృష్ణయ్య: "ఉడిగెను వానయు గాలియు
వడిసెడె నదులెల్ల బొలుప వఱద లిగిరె గొం
డడుగున నుండక వెడలుడు
కొడుకులు గోడండ్రు సతులు గోవులు మీరున్"

[ అంతలో శంఖాలూ దుందుభులూ మ్రోగినై. గోపకులు గొంతెత్తి "శ్రీ కృష్ణ పరమాత్మకూ జై" అని అరిచారు. ఉపనందుడు నందుని సమీపించాడు. ]

ఉపనందుడు:

"ఓ నంద గోప వల్లభ
నీ నందను డాచరించు నేర్పరి తనముల్
మానవులకు శక్యంబులె
మానవ మాత్రుండె నీ కుమారుడు తండ్రీ"

[ అది విన్న గోపకులు తిరిగి కృష్ణయ్యకు జేజేలు చెప్పారు; చెబుతూనే కొండ క్రింద నుంచి బయటకు వెళ్లారు.
కృష్ణయ్య ఒక క్షణ కాలం కళ్లు మూసుకుని నుంచున్నాడు. ఆవెంటనే, అంత వరకు తన వ్రేలిమీద ఉన్న కొండను పైకి విసిరాడు. అది పెద్ద శబ్దం చేస్తూ యెగిరి దూరంగా యెక్కడో 'గుభీ' మని కూలింది. అది గ్రహించిన కృష్ణయ్య మందహాసం చేశాడు.
అంతలో యింద్రుణ్ణి వెంట బెట్టుకుని కామధేనువు అక్కడకు వచ్చింది.
మరు క్షణంలో యింద్రుడు కృష్ణయ్య పాదాలమీద పడ్డాడు. "పురాణ పురుషా... ! పరమేశ్వరా! క్షమించు

తండ్రీ! నన్ను రక్షించు నాయనా!" అంటూ కన్నీటితో ఆయన కాళ్లు కడిగాడు.
కృష్ణయ్య ఒకసారి అతని వంక సానుభూతితో చూశాడు. ఆ వెంటనే బలరాముని వంక చూస్తూ చిలిపిగా నవ్వాడు. ]

ఇంద్రుడు: ...పరాత్పరా!

"నీ సామర్థ్య మెఱుంగ మేఘములచే
 నీ ఘోషముల్ భీషణో
గ్రా సారంబున ముంచితిన్ మఖము నా
 కై వల్లవుల్ సేయ రం
చో సర్వేశ భవన్మహత్త్వమున నా
 యుద్యోగ మిట్లయ్యె నీ
దాసున్ నన్ను గృతాపరాధు గరుణన్
 దర్శింపవే మాధవా!"

[ కృష్ణయ్య చిరునవ్వు నవ్వుతూ యింద్రుని లేవదీశాడు. ]

కృష్ణయ్య: "అమరాధీశ్వర లక్ష్మితో దగిలి యి
 ట్లంధుండవై యున్న నీ
సమదోద్రేకము ద్రుంచి వైచుటకు నీ
 జన్నంబు దప్పించితిం
బ్రమదశ్రీకులు దండధారి నగు నన్
 భావింప రెవ్వాని ని
క్కము రక్షింప దలంతు వాని నధనుం
 గావింతు జంభాంతకా!"

[ అది విన్న యింద్రుడు తల వాల్చుకున్నాడు. ]

ఇకమీద...

"నా యాజ్ఞ సేయుచుండుము
నీ యధికారంబునందు నిలువు సురేంద్ర
శ్రీయుతుడవై మదింపకు
శ్రేయంబులు గల్గు బొమ్ము సితకరిగమనా!"

[ ఇంద్రుడు తిరిగి కృష్ణయ్య పాదాలు తాకాడు. "ధన్యోస్మి! ధన్యోస్మి!" అనుకున్నాడు. కృష్ణయ్య మందహాసం చేశాడు.]



## ★ ముఖ్యపాత్రలు ★

1. కృష్ణయ్య
2. బలరాముడు
3. నందుడు
4. ఉపనందుడు
5. వరుణుడు



# పితృభక్తి

## ★ 1. వ రంగం ★

[ అది యమునా నదికి వెళ్లేదారి. దారి పొడుగునా చీకటిగా ఉంది. కీచురాళ్లు కూస్తున్నై. చెట్ల ఆకులు గుస గుస లాడుతుంటున్నై.
నందుడూ, ఉపనందుడూ, మరికొందఱు గోపాలురూ, యమునా నది వేపుగా వెడుతున్నారు. ]

**ఉపనందుడు:**

...నందా! నిజంగా నీ జన్మ తరించిందయ్యా!

"బాంధవమున నైన బగనైన వగనైన
ప్రీతి నయిన బ్రాణ భీతి నయిన
భక్తి నైన హరికి పరతంత్రులై యుండు
జనులు మోక్షమునకు జనుట *నిజము"

అటువంటప్పుడు ఆయనకు తండ్రివైన నీకు పునర్జన్మ ఉన్నదంటావా ?

[ అది విన్న నందుడు తనలో తాను మురిసి పోయినాడు. ]

**గోప వృద్ధుడు:**

మా దొరని మించిన అదృష్టం మా దొరసానిది. ఆవిడ కృష్ణయ్యను కళ్లల్లోనే కట్టేసుకుంది. అంతేకాదు. ఆవిడ ఆయనకు చెయ్యని ఉపచార మంటూ ఉండదు. ఆవిడే స్వయంగా ఆయన్ని జలక మాడిస్తుంది; యెంతో చక్కగా అలంకరిస్తుంది.

ముప్ఫొద్దులా, పాలూ, నెయ్యీ, వెన్నా, ఒకటేమిటి ...యేది కావాలంటే అది ఆయన నోటికి స్వయంగా అందిస్తుంది.
...ఆయనకు కూడా 'అమ్మ' అంటే అంత ప్రాణం. నిజంగా అదృష్టం అంటే అదృష్టం ఆ విడది కదూ ?

**ఉపనందుడు:**

ఆహా! ముమ్మాటికీను !
"పరమేశ్వ రార్పణమ్ముగ
పరజనులకు భిక్షయిడిన పరమ పదమునకా
బరగెదరట తుది సాక్షా
త్పరమేశుడు భిక్షసేయ ఫలమెట్టిదియో ?"

**నందుడు:** ఎవరు చేసిన పుణ్యం యెటువంటిదో యెవరికి తెలుసు ?

[ అలా ముచ్చటించుకుంటూనే, వారు, యమునా నదిని సమీపించారు. ]



## ★ 2. వ, రంగం ★

[ యమునా నదిలో ఒక ప్రక్క కొందరు రాక్షసు లున్నారు. వారి కళ్లు చింత నిప్పుల మాదిరి ఉన్నై. ]

**రాక్షసుడు:** 1. ...ఉఁహూఁ! సమయం తెలుసుకోకుండా యెవరో స్నానానికి వస్తున్నారు.

2. వాళ్లకు తెలియదని నీ కెలా తెలుసు?

1. తెలిస్తే యిలా వస్తారా?

2. ఎందుకు రారు? 'మనకేం?' అనే ధీమా ఉంటే సరి!

1. అయితే, వీళ్లు కూడా...

2. ఆ హాఁ...అదే రకం! కనబడతూనే ఉందిగా!

[ అతని అభిప్రాయం అర్థంకాక రాక్షసుడు 1. అతని వంక చూశాడు. ]

వాళ్లు మందనుంచి వస్తున్నారు; చూస్తున్నావా?

1. ఆఁ......!

2. మందలో ఉన్నవా ళ్లెవరూ, యీ మధ్య, 'మనం మనుష్యులం' అనుకోవటంలేదు. నీ కది తెలుసా?

1. ఊఁ...! దేవతల మనుకుంటున్నారా యేమిటి కొంపతీసి?

2. మరే మనుకున్నావ్?

1. అలా అయితే, మనం, జాగ్రత్తగా ఉండాలిసిందే! ...దాక్కో...దాక్కో......!!

[ అంటూనే రెండోవాని మెడ పట్టుకుని నీటిలో ముంచాడు. అంతలో నందాదులు అక్కడకు వచ్చారు. వచ్చి, తమ బట్టలు గట్టున పెట్టుకుని నదివేపుగా నడిచారు. నందుడు ముందుగా నదిలోకి దిగాడు.

అతడలా దిగి దిగటంతోటే రాక్షసులు వికటాట్టహాసం చేశారు. ఉపనందుడూ, గోప వృద్ధులూ భయపడి వెనక్కు వెళ్లారు; 'కృష్ణా ! కృష్ణా !' అని అరిచారు. తిరిగి వారు నది వేపు చూసేటప్పటికి, వారికి, నందుడు కనబడలేదు. ]

**ఉపనందుడు:**

...అయ్యో అయ్యో; నందా... ! నందా !!

**గోపకుడు: 1.**

... కృష్ణా... ! కృష్ణా !! ఓ...కృష్ణా !!

[ అంతలో దూరంనుంచి వేణునాదం వినిపించింది. మరుక్షణంలో కృష్ణయ్య అక్కడికి వచ్చాడు. ]

...కృష్ణా... ! కృష్ణా... ! నందుడు నాయనా... నందుడు... !!

**ఉపనందుడు:**

...నదిలో దిగాడు; మళ్లీ కనబడలేదు !

**గోపకుడు:** 2. ఆయన దిగగానే, అదేమిటో ... ఆకాశం పగిలినంత చప్పుడయింది !

1. రాక్షసులు నవ్వారా అనిపించింది !

**కృష్ణయ్య:** ( తల పంకిస్తూ )

ఊఁ... ! సరే ! మీరు యింటికి వెళ్లండి !

**ఉపనందుడు:**

నందుడు లేకుండానా... ?

**గోపకులు:** నందుడులేని మందలో మాకేం పనుంది ? నందుణ్ణి నదిలోవదిలి మేం మందకెలా వెడతాం ? కృష్ణా... ! కష్ణా... ! !

[ కృష్ణయ్య వారివంక సానుభూతితో చూశాడు. చూస్తూనే 'గుభేల్' మని నదిలోకి ఉరికాడు. ]



## ★ 3. వ రం గం ★

[ అది వరుణుని కొలువు కూటం. అక్కడ నందుడు ఒక సింహాసనం మీద ఉన్నాడు. అతని పాదాల దగ్గర, వరుణుడు, చేతులు మోడ్చి కూర్చున్నాడు.
వరుణుని ముఖంలో అమితమైన ఆవేదన కనబడుతోంది. ]

**వరుణుడు:** మాధవుని తండ్రికి మహాపచారం జరిగింది!

**నందుడు:** అదేమిటి నాయనా...? అపరాధిని దండించటం అపచారమెలా అవుతుంది? అదీకాక, అధికారి అయిన వాడు, తన వాళ్లనీ పరాయివాళ్లనీ అనుకుంటే జరుగుతుందా? అసలలా అనుకోవటం మాత్రం న్యాయమా? అతని దృష్టిలో అందరూ ఒకటే. తప్పుచేసిన వాడు తన వాడైనా శిక్షార్హుడే అవుతాడు. నామటుకు నేను, సమయంకాని సమయంలో స్నానానికి వెళ్లాను. అది నా తప్పు కాదూ? చేసిన తప్పుకు శిక్ష అనుభవించక తప్పుతుందా?

[ అంతలో వారికి వేణునాదం వినిపించింది. వరుణుడూ నందుడూ అటుగా చూశారు. మరుక్షణంలో కృష్ణయ్య వారి ముందుకు వచ్చాడు.
వరుణుడు కృష్ణయ్యను చూశాడు. చూసి, గబ గబా అటు వెళ్లాడు; ఆయన కాళ్లమీద వడ్డాడు. ]

**వరుణుడు:** పరమేశ్వరా! ఈ కారణంగా నాకు ప్రత్యక్షమైనావా తండ్రీ! ఈ పని పెట్టుకుని యింతదూరం వచ్చావా నాయనా! ఆహాహా! నా భటుడు చేసిన అపచారం నాకెంత మేలు చేసింది? కృష్ణా! కృష్ణా!!

" ఏ విభు పాదపద్మరతు
లెన్నడు నెవ్వరు బొందలేని పెం
ద్రోవ జరింతు రట్టి బుధ
తోషక నీ వరుదెంచుటంబ్రమో

దావృత మయ్యె జిత్తము గృ
తార్థతనొందె మనోరథంబు నీ
సేవ బవిత్ర భావమున
జెందె శరీరము నేడు మాధవా!"

[ కృష్ణయ్య వరుణుని లేవదీశాడు. అంతలో నందుడు ముందుకు వచ్చాడు. కృష్ణయ్య ఆయనకు యెదురు వెళ్లి పాదాభివందనం చేశాడు. నందుడు అతణ్ణి దీవించాడు. అది చూసిన వరుణుడు 'పితృభక్తి అంటే యిది;' అన్నట్టుగా తల పంకించాడు; కృష్ణయ్యను సమీపించాడు. ]

...జగన్నాథా!

" ఎఱుగమి జేసి నాభటుడొ
కించుక రైన మనంబులోపలం
దెఱుకువ లేక నీ జనకు
దెచ్చె దయం గొనిపొమ్ము ద్రోహముల్
మఱవుము నన్ను నీ భటుని
మన్నన సేయుము నీదు సైరణల్
వఱలుదుగాదె యో జనక
వత్సల నిర్మల భక్త వత్సలా"

కృష్ణయ్య: వరుణా! ఇందులో నీ తప్పేముంది; నీ భటుల తప్పే ముంది? ఎవరి ధర్మాన్ని వారు నిర్వర్తించుకున్నారు; అంతే!

[ వరుణుడు 'పరమేశ్వరా!' అంటూ, తిరిగి కృష్ణయ్య పాదాల మీద పడబోయినాడు. కృష్ణయ్య అతణ్ణి ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడు.
వరుణుని భక్తి భావాన్ని చూసి నందుడు పరవశుడైనాడు. ]

నందుడు: ఇంతటి ఉన్నత పదవికూడా యితని కళ్లను కప్పలేక పోయింది; చూశావా?

కృష్ణయ్య: ఇతనిలో ఉన్న విశేషమే అది!

[ అది విన్న వరుణుడు కృష్ణయ్యకు కృతజ్ఞత చూపుతూ, తల వంచుకున్నాడు. కృష్ణయ్య మందహాసం చేశాడు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

1. కృష్ణయ్య
2. బలరాముడు
3. నందుడు
4. సుదర్శనుడు
5. యశోద



# సుదర్శన శాప విమోచనం

## ★ 1. వ, రంగం ★

[ అది సరస్వతీ నది సమీపంలో ఉన్న లంబికావనం. అక్కడ ఒక పెద్ద జాతర జరుగుతోంది. గోపకులందరితో పాటు నంద యశోదలు కూడా ఓ ప్రక్క కూర్చుని ఉమామహేశ్వరు లను పూజిస్తున్నారు. ]

కొందరు గోపకులు:

తండ్రీ...!

"కొందరు కలడందురు నిను
కొందరు లేడందు రతడు గుణి గాడనుచున్
గొందరు కలడని లేడని
కొందల మందుదురు నిన్ను గూర్చి మహేశా!"

"లంపటము నివారింపను
సంపద గృపనేసి జయము సంపాదింపన్
జంపెడి వారి హరింపను
సొంపారగ నీక జెల్లు సోమార్ధహరా!"

"నీ కంటె నొండెఱుంగము
నీ కంటెం బరులు కావనేరరు జగముల్
నీ కంటె నొడయడెవ్వడు
లోకంబుల కెల్ల నిఖిల లోకస్తుత్యా!"

[ వారలా ప్రార్థనచేసుకుంటున్న సమయంలో ఒక పెద్ద పాము నందుని చేరువగా వచ్చింది.
అది చూసిన గోపకులు 'అయ్యో అయ్యో... పాము, పాము' అంటూ అరిచారు. ]



## ★ 2. వ, రంగం ★

[ అదే వనంలో మరొక చోట కృష్ణ బలరాములు పడుకుని ఉన్నారు. గోపకులు వేసిన కేకలకు వారికి మెలకువ వచ్చింది. ఆ వెంటనే వారు లేచారు; కేకలు వినిపిస్తున్న వేపుగా చూశారు. ]

**బలరాముడు:**... 'పాము' అంటున్నారు; వింటున్నావా?

**కృష్ణయ్య:** ఆఁ...! ఎవరిని యేం చేసిందో యేమో...!

[ అంటూనే కృష్ణయ్య అటుగా పరిగెత్తాడు. బలరాముడు అతణ్ణి అనుసరించాడు. ]



## ★ 3. వ, రంగం ★

[ అక్కడ ఒక పాము చుట్టూ చేరి కొందరు గోపకులు హడా వుడి చేస్తున్నారు. వారిలో కొందరు ఆ పామును గొడ్డళ్లతో నరకటానికి ప్రయత్నిస్తున్నారు.

అంతలో బలరామకృష్ణులు అక్కడకు పరిగెత్తుకుంటూ వచ్చారు. అప్పటికి నందుడు సగం వరకు పాము నోట్లో ఉన్నాడు. ]

**నందుడు:** కృష్ణా ! ఆపదోద్ధారకా ! తండ్రీ !!

**బలరాముడు:** అయ్యయ్యో ... అది నాన్నగారిని మింగేస్తోంది !

**యశోద:** ( కృష్ణయ్యను సమీపించి )

కృష్ణా...! కృష్ణా...! నాన్నగారిని రక్షించు నాయనా !

[ కృష్ణయ్య తల పంకించాడు. అతని కళ్లు నిప్పులు కక్కుతున్నై. అలాగే అత నా పామును సమీపించాడు. సమీపించటమే తడవుగా దాన్ని ఒక్క తన్ను తన్నాడు.
అంతలో ఒక పెద్ద వెలుగు వచ్చింది. వెంటనే ఆ పాము ఒకచక్కని యువకుడుగా మారింది. అది చూసిన అందరూ ఆశ్చర్యపడ్డారు.
ఆ యువకుడు కృష్ణయ్య పాదాలమీద వ్రాలాడు; కృష్ణయ్య అతణ్ణి లేవనెత్తాడు. ]

**కృష్ణయ్య:** ... ఎవరు నువ్వు ? ఈ రూపంలో యెందు కున్నావ్ ?

**సుదర్శనుడు:** స్వామీ...! నేనొక గంధర్వుణ్ణి. నా పేరు సుదర్శనుడు. నా అందచందాలూ ఐశ్వర్యం నా కళ్లు కప్పేసినై. నేనొక గర్వపోతుగా తయారైనాను. ఒకనాడు నేను విమానంలో వెడుతూ, కురూపులైన కొందరు మునులను చూసి వెక్కిరించాను. వారది గ్రహించి నన్నొక పాముగా పుట్టమని శపించారు. నేను చేసిన దోషం నాకు అప్పుడు తెలిసింది. ఆవెంటనే నాకు అమితమైన పశ్చాత్తాపం కలిగింది. అందుకనే వారి పాదాలమీద పడ్డాను. శాపవిముక్తికి దారిచూపించవలసిందని ప్రార్థించాను. అప్పుడు వారు...

" యదుకులమందు భక్తుల భ
యంబు హరించుటకుజ్ జనార్దనుం
డుదయమునొంది యీ యడవి
కొక్కదినంబున రాగలండు త
త్పదమున నీవు దన్నబడి
పన్నగదేహము తోడ బాసి నీ
మొదలిటిమేను గాంచెదవు
మూఢుడ పొమ్మని రో దయానిధీ!"

[ ఆ గాథ విని అందరూ ఆశ్చర్యపోయినారు. గోపికలూ గోప కుమారులూ కృష్ణయ్యకు జేజేలు చెప్పారు.

కృష్ణయ్య మందహాసం చేస్తూ సుదర్శనునివంక చూశాడు. ]

...అప్పటినుంచీ యిప్పటి వరకూ యీ రోజు కోసమే యెదురుచూస్తూ యీ చుట్టు ప్రక్క

లనే తిరుగుతున్నాను. నీ పాద స్పర్శవల్ల నాకు శాపవిముక్తి కలిగింది. నీ దివ్య దర్శనంవల్ల నా జన్మ తరించింది.

జగన్నాథా!

" నిను జింతించిన నిన్ను పేరుకొనినన్
నిర్మూలమై క్రుస్సి పా
పనికాయంబు వినష్టమౌనట భవ
త్పాదంబు నామీద బె
ట్టిన దద్బ్రాహ్మణ శాపసంజనిత కౌ
టిల్యంబు దా నిల్చునే
వనజాతేక్షణ నేడువాసె నురగ
త్వం బెల్ల నే బోయెదన్"

[ అంటూ అతను కృష్ణయ్య పాదాల నంటుకున్నాడు. ఈ మాటు అక్కడ ఉన్న అందరూ కృష్ణయ్యకు జేజేలు చెప్పారు.

ఆ వెంటనే సుదర్శనుడు నందుని సమీపించాడు; ఆయన ముందు సాష్టాంగ పడ్డాడు.

నందుడు సుదర్శనుని లేవదీశాడు. ప్రేమతో హృదయానికి హత్తుకున్నాడు. ]

...స్వామీ! స్వార్థానికి లొంగి మిమ్మల్ని చాలా బాధపెట్టాను ... క్షమించండి!

**నందుడు:** ( చిరునవ్వుతో )

అదేమిటి నాయనా? నీ స్వార్థంలో దోషమేముంది? నన్ను హింసించటం నీ అభిప్రాయం కానే కాదుగా!

[ అది విన్న సుదర్శనుడు 'మహానుభావా!' అంటూ నందుని కౌగిలించుకున్నాడు. అది చూసిన కృష్ణ బలరాములు మందహాసం చేశారు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

1. కృష్ణయ్య
2. బలరాముడు
3. గుహ్యకుడు



# గుహ్యకసంహారం

## ★ 1. వ, రంగం ★

[ అది బృందావనానికి వెలుపల ఉన్న వనం. అక్కడ ఒక చెట్టుమీద కూర్చుని, కృష్ణయ్య వేణువు నూదుతున్నాడు. ఆవులూ, దూడలూ, అతని చుట్టూ చేరి, చెవులు నిక్కించి, ఆ మురళీ స్వనాన్ని వింటున్నై.

బలరాముడు అక్కడే ఓ ప్రక్కగా కూర్చుని ఉన్నాడు; ఓ చిన్ని లేగను ముద్దులు చేస్తున్నాడు. ]



## ★ 2. వ, రంగం ★

[ ఆ వనంలోనే, అక్కడికి కొద్ది దూరంలో ఉన్న ఒక చెట్టు చాటున యిద్దరు గోపికలు నుంచుని ఉన్నారు. వాళ్లిద్దరూ కూడా కృష్ణయ్య వంకనే చూస్తున్నారు. ఆ చూపుల్లో పరవశత్వం ప్రతిబింబిస్తోంది.

ఒక క్షణంసేపు అలాగే ఉండిపోయి, వారు, ఒకరి వంక ఒకరు ఓరగా చూసుకున్నారు ; ముసి ముసి నవ్వులు నవ్వుకున్నారు. ఆ తరువాత... ]

**గోపిక: 1.**

" శ్రవణోదంచిత కర్ణికా రకముతో
స్వర్ణాభ చేలంబుతో
నవతంసాయిత కేకి పింఛకముతో
నంభోజ దామంబుతో
స్వవశుండై మధురాధరామృతముచే
వంశంబు పూరించుచు
న్నవిదా మాధవు డాల *గూడి* వనముం
దోప్పారెడిం జూచితే! "

[ ఆ విషయాన్ని, ఆమె, రహస్యం చెబుతున్నట్టుగా చెప్పింది. అది విన్న ఆమె స్నేహితురాలు కొద్దిగా నిట్టూర్చింది ; తనేదో చెప్పటానికి సందేహిస్తున్నట్టుగా ఆమె వంక చూసింది. చూసి ... ]

2. " తలకెను గొబ్బున జిత్తము
నలినాక్షుని మధురవేణు నాదము నా వీ
నులు సోకినంత మాత్రన
చెలియా యిక నెట్లు వెరవు చింతింపగదే! "

1. ఊఁ...! ఇది చెప్పటానికి యింతగా నిట్టూర్చాలా ?
అయినా, దీనికింత ఆలోచన దేనికి... ఆవేదన
దేనికి ?

" నాతోడ వెఱవ వలదే
నాతోడనె గొనుచుపోయి నలిన దళాక్షున్
నీ తోడుత బలికించెద
నీ తోడు జనంబు మెచ్చ నీ తోడుసుమీ ! "

[ అది విన్న ఆమె స్నేహితురాలు కొంచెంగా సిగ్గుపడ్డది; తల వంచుకుంది. ]

...ఊఁ...పోదాంరా... !

[ అంటూ ఆమెతో చెయ్యి కలిపి ముందుకు వెళ్లింది. ]



## ★ 3. వ రంగం ★

[ అదే వనంలో, మరోచోట, కొందరు గోపకన్యలు గుమిగూడి ఉన్నారు; దూరానికి చూస్తున్నారు. వాళ్లందరిలోనూ అదో విధమైన ఆశ్చర్యం కనబడుతోంది. ]

కన్య: 1.

" తల్లుల చన్నుబాలు మును
ద్రావుతఱిం దమ కర్ణ వీథులన్
వల్లభమైన మాధవుని
వంశ రవామృత ధార సొచ్చి నం
దుల్లక పాలు రాదివక
దూటక మానక కృష్ణుమీద దృ
గ్వల్లులు సేర్చి నిల్చె నదె
వత్సము లంగన లార కంటిరే! "

2. ఉఁహూఁ......అంతేనా......?

" మమతన్ మోములు మీది కెత్తుకొని గో
మంథంబు సారించి హృ
త్కమలాగ్రంబుల గృష్ణు నిల్పి మురళీ
గానామృత శ్రేణి క
ర్ణములం గ్రోలుచు మేతమాని గళితా
నందాశ్రులై చిత్రితో
పమలై గోవులు సూచుచున్న వవిగో
పద్మాక్షి వీక్షించితే! ",

3. అవేమిటి గాని, ఆ మురళి చూడు!

"ఒనరఁ బ్రేతల కించుకేనియును లే
కుండంగ గోపాల కృ
ష్ణుని కెమ్మోవి సుధారసంబు గొనుచుం
జోద్యంబుగా మ్రోయుచుఁ
దన పర్వంబులు నేత్ర పర్వములుగా
దర్పించె బూర్వంబునఁ
వనితా యెట్టి తపంబుసేసె నొకో యీ
వంశంబు వంశంబులోఁ"

4. ఊఁహుఁ! ... ఆ రహస్యమే మనకు అర్థమైతే
మన అదృష్టం మరోవిధంగా ఉండేది కదూ?

[ హృదయ భారంతో గోపిక లందరూ క్రిందికి చూశారు. ]

1. ఇప్పుడు మాత్రం మన కేమంత తక్కువయింది?
మందలో పుట్టాం...! మాధవుణ్ణి చూస్తున్నాం!
ఈ జన్మకు యీ అదృష్టం చాలదూ?

2. నిజమే! ఇది మాత్రం అందరికీ లభిస్తుందా?

[ అది విన్న గోపకన్యలు తమ అదృష్టాన్ని తలచుకుని తమలో తాము ఉప్పొంగిపోయినారు. ఆ ఉత్సాహంతోనే అక్కడి నుంచి కదిలారు. ]



## ★ 4. వ, రంగం ★

[ బలరామ కృష్ణు లున్నచోటికి నలు మూలలనుంచీ గోపికలు వచ్చారు. వారిని చూసి కృష్ణయ్య మురళి వాయించటం ఆపాడు ; కొద్దిగా ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు. ]

**కృష్ణయ్య:** ...ఇదేమిటి...యిలా వచ్చారు ?

" మేలా మీకు భయంబు పుట్టదు కదా
మీ మందకున్ సింహ శా
ర్దూలానేకప ముఖ్యముల్ దిరిగెడిన్
దూరంబు లేతెంతురే
యేలా వచ్చితి రీ నిశా సమయమం
ది చోటికి వర్తింతురే
చాలుంజాలు లతాంగులార చనుడా
సంప్రీతితో మందకున్"

**గోపికలు:** ( భయంతోనూ, సిగ్గుతోనూ )

కృష్ణా!...నువ్వే యిలా అంటే మే మేమైపోవాలి ?

" నీ పాద కమలంబు నెమ్మి డగ్గరగాని
తరలి పోవంగ పాదములు రావు
నీ కరాబ్జంబుల నెరి నంటితివగాని
తక్కిన పనికి హస్తములు సొరవు
నీ వాగమృతధార నిండ గ్రోలగ గాని
చెవు లన్యభాషలు సేరి వినవు
నీ సుందరాకృతి నియతి జూడగ గాని
చూడ వన్యంబుల జూడ్కి కవలు

నిన్నుగాని పలుక నేరవు మా జిహ్వ
*లెల్లరకును నీవ యేడు గడవు*
మా మనంబులెల్ల మరపి దొంగిలితివి
యేమిసేయువార మింక గృష్ణ!"

[ ఆ మాటలు విని కృష్ణయ్య పక పకా నవ్వాడు.
గోపికలు కొద్దిగా చిన్నబుచ్చుకున్నారు.
ఆ సమయంలో, కుబేరుని భటుడైన శంఖ చూడుడు అక్కడే కొద్ది దూరంలో ఉన్నాడు. అతనికి పరిస్థితి అంతా అర్థ మయింది. అతనిలో అసూయ పుట్టుకొచ్చింది. ఆ వెంటనే అతను యేదో దుర్మార్గాన్ని తలపెట్టినట్టుగా తల పంకించాడు. మరు క్షణంలో గోపిక లందరూ, తమకు తెలియకుండానే శంఖచూడుని వేపుగా వెళ్లసాగారు. అది చూసిన కృష్ణ బల రాములు ఆశ్చర్యపడ్డారు ; 'అదేమిటి?' అన్నట్టుగా వాళ్ల వేపు చూశారు.

అంతలో శంఖచూడుడు విజయ గర్వంతో వికటాట్టహాసం చేశాడు. బలరామ కృష్ణులు అది విన్నారు; అటు చూశారు.]

**బలరాముడు:**

అడుగో...శంఖచూడు డల్లే ఉన్నాడు !

**కృష్ణయ్య:** అరెరె...గోపిక లందరినీ తరుముకు పోతున్నాడే!

**బలరాముడు:**

ఊఁ...! వాడి యోగబలం దీనికి ఉపయోగించిం దన్నమాట !

[ అంతలో దూరంనుంచి 'కృష్ణా ! రామా !' అన్న ఆర్తనాదాలు వినిపించినై. ]

వింటున్నావా...?

[ ఆ మాట విన్న కృష్ణయ్య చెట్టుమీదినుంచి క్రిందికి దుమి కాడు ; దుమికి ... ]

...బృందా...! గౌతమీ...! రాధా...! భయ పడకండి... భయపడకండి!!

**బలరాముడు:**

( దూరానికి చూస్తూ )

...అదుగో ... చూశావా...! నీ మాట విని వాడు పలాయనం చిత్తగిస్తున్నాడు!

కృష్ణయ్య: ఉఁహుఁ... పిరికిపంద! కుబేరుని భటుణ్ణికదా అని క్రొవ్వి తిరుగుతున్నాడే కాని గుండెధైర్యం యెక్కడుంది?

[ అలా అంటూనే కృష్ణయ్య ముందుకు పరిగెత్తాడు. బల రాముడు అతణ్ణి అనుసరించి వెళ్లాడు. ]



## ★ 5. వ రంగం ★

[ కృష్ణా ! కృష్ణా ! అని పరిగెత్తుకు వస్తున్న గోపికలూ, వాళ్ల వేపుగా వెడుతున్న బలరామకృష్ణులూ ఒక చోట కలుసుకున్నారు. కృష్ణయ్య వాళ్లవంక సానుభూతితో చూశాడు; తిరిగి అక్కడినుంచి కదిలాడు. అలా కదిలి వెళ్లబోతూ, కృష్ణయ్య మళ్లీ ఆగాడు; బలరాముని వంక చూశాడు. ]

కృష్ణయ్య: నువ్వు, వీళ్లనిచూస్తూ...యిక్కడే ఉండు !

[ అని అంటూనే కృష్ణయ్య శంఖచూడుడు పోతున్న వేపుగా పరిగెత్తాడు. ]



## ★ 6. వ, రంగం ★

[ శంఖచూడుడు ప్రాణభీతితో పరిగెత్తుకు పోతున్నాడు; కృష్ణయ్య అతణ్ణి తరుముకుంటూ వెడుతున్నాడు.

అలా కొంతదూరం వెళ్లి, కృష్ణయ్య అమాంతంగా ఆగాడు; ఆశ్చర్య పడ్డాడు. ]

**కృష్ణయ్య:** అరెరె...పాముగా మారాడే!

[ అలా అనుకుంటూనే, తిరిగి అతను ముందుకు పరిగెత్తాడు. ]



## ★ 7. వ రంగం ★

[ బలరాముడూ గోపికలూ కృష్ణయ్య వెళ్లిన వేపుగా చూస్తున్నారు. బలరాముని ముఖంలో ఆశ్చర్యమూ సంతోషమూ కనబడుతున్నై. ]

**బలరాముడు:**

...భేష్ భేష్! అదీ చెయ్యాల్సిన పని!

( గోపికల నుద్దేశించి )

...అదుగో ... వాడు పాము పొదలో దూరితే, మన కృష్ణయ్య గరుడుడై వాణ్ణ వెదుకుతున్నాడు!

**గోపికలు:** ఆఁ ఆఁ...బలే బాగుంది!

**బలరాముడు:** ( అటే పరీక్షగా చూస్తూ )

... అదుగదుగో ...! వాడు నిప్పుమాదిరి నిలబడ్డాడు; చూశారా?

**గోపిక:** 1. అబ్బ! ఆకాశా న్నంటు కుంటున్నాడే!

**బలరాముడు:**

ఐతే యేం...? అవుగో... మేఘాలు!

**గోపిక:** 2. అవెక్కడివి?

3. ఎక్కడి వేమిటి...కృష్ణయ్యలోవే!

4. అబ్బ! ఎంత నల్లగా ఉన్నయ్యో చూశావ్?

3. ...అచ్చంగా తండ్రిపోలికే!

[ ఆమాట విన్న గోపికలూ బలరాముడూ కూడా విరగబడి నవ్వారు. ]

**బలరాముడు:**

అదుగో...కుంభవృష్టి కురుస్తోంది!

[ గోపికలు ఆశ్చర్యంతో అటే చూడసాగారు. అంతలో, రెండు కొండలు ఢీకొన్నంత మోత అయింది. ]

కృష్ణా...! కృష్ణా...! అలా కాదు...అలా కాదు!
ఎగిరి తన్నాలి! తలమీద కొట్టాలి...! ఊఁ...!

[ అంతలో దూరంనుంచి పిడుగు పడ్డంత చప్పుడయింది. శంఖచూడుడు ప్రాణం వదులుతూ బ్రహ్మాండం బ్రద్దలయేటంత కేక పెట్టాడు. అది విన్న బలరాముడూ గోపికలూ సంభ్రమంతో చప్పట్లు చరిచారు. ]

**గోపిక:** 1. అమ్మయ్య...! ఒక పీడ విరగడై పోయింది!

[ వారలా అనుకుంటూ ఉండగానే, నెత్తురు బట్టలతో కృష్ణయ్య అక్కడకు వచ్చాడు. బలరాముడు అమాంతంగా ముందుకు ఉరికి కృష్ణయ్యను కౌగిలించుకున్నాడు. ]

**కృష్ణయ్య:** ...ఇదుగో...నీకే!

[ అంటూ ఒక రత్నాన్ని బలరామునకు అందించాడు ]

**గోపికలు:** ఏమిటది...?

**బలరాముడు:**

ఏమీ లేదు...శంఖచూడుని శిరోరత్నం.

**గోపిక:** 4. ( ఆతృతతో ముందుకు వంగి చూస్తూ )
...అబ్బ...యెంత బాగుంది!
5. ఇది వాడి తలలో ఉందా?

**బలరాముడు:**

ఆఁ! ఇది చూసుకునే వాడు గర్వపడ్డాడు!

**గోపిక:** 3. ఊహుఁ! గర్వం! ఎందుకొచ్చిన గర్వమో అది?
2. ఎందుకో యేమిటి...కొంప కూల్చుకోవటానికే!

[ 'అసలు విషయం అది' అన్నట్టుగా కృష్ణయ్య తల ఆడించాడు. అది చూసిన బలరాముడు మందహాసం చేశాడు. గోపికలు, కృతజ్ఞతతో కృష్ణయ్యవంక చూస్తూ నిలబడి పోయినారు. ]



## ★ ముఖ్య పాత్రలు ★

1. కృష్ణయ్య
2. నందుడు
3. వృషభాసురుడు



# వృషభాసుర వధ

## ★ 1. వ్రరంగం ★

[ ఒక కథకుడు, వృషభాసుర వధకు సంబంధించిన గాథ చెబుతున్నాడు. ]

కథకుడు:

...శంఖచూడుని సంహరించిన తరువాత శ్రీకృష్ణ బలరాములు మందకు చేరుకున్నారు. గోపకన్యలను, యెవరి యిళ్లదగ్గర వారిని వదిలి, వారు, తమ యింటికి వెళ్లారు.

అది జరిగిన కొద్ది రోజులకే, మందలో, మరొక ప్రళయం సంభవించింది.

" ఎవ్వని మూపుర మీాక్షించి మేఘంబు
లద్రి శృంగం బని యాశ్రయించు
నెవ్వని రంకె కర్ణేంద్రియంబులు సోక
గర్భపాతంబగు గర్భిణులకు
నెవ్వని పదహతి నెగయు పరాగంబు
లంధకారారాతి నావరించు
నెవ్వడు గోష్ఠుల నెదిరించి చిమ్మిన
బృథ్వీధరంబులు పెల్లగిల్లు
నట్టి వృషభాసురేంద్రు డహంకరించి
వాల లత యెత్తి పెను రంకె వైచి నేల
గాలు ద్రువ్వుచు నిశిత శృంగములు సాచి
మంద బెగడంద గదిసె నమందు డగుచు."

అతణ్ణిచూసి, మందలో ఉన్న ఆవులూ దూడలూ, కట్లు తెంపుకుని పారిపోయినై. అక్కడున్న ఆబాల గోపాలం యిళ్లూ వాకిళ్లూ వదిలి 'బ్రతికితే చాలు' అనుకుని బయటపడ్డారు. బృందావనం అంతా అల్ల కల్లోలమైపోయింది. 'కృష్ణా! కృష్ణా!' అన్న కేకలూ హాహాకారాలూ ఆప్రదేశమంతటా మారుమ్రోగినై.

ఆ సమయంలో బలరామకృష్ణులు అక్కడ లేరు; ఊరివెలుపల ఉన్న ఒక వనంలో ఉన్నారు. మందలో పుట్టిన అలజడి వారి చెవుల్లో పడ్డది. వెంటనే, వారు, అక్కడనుంచి బయలుదేరారు; మంద వేపుగా పరిగెత్తారు.



## ★ 2. ప్ర రం గం ★

[ అది, మందకూ, ఊరి వెలుపల ఉన్న వనానికీ, మధ్య ఉన్న బాట. బలరామ కృష్ణులు, అక్కడకు చేరుకున్నారు; ఆగారు; మందవేపుగా చూశారు.

అంతలో, దూరాన ఉన్న వృషభాసురుడు, కృష్ణయ్య కంటబడ్డాడు. దాంతో అక్కడి పరిస్థితి అంతా కృష్ణయ్యకు అర్థమయింది. అతని కళ్లు నిప్పులు కక్కినై. ]

కృష్ణయ్య: ......వృషభాసురా...! ఆగు ఆగు...!!

" బాలుర నింతులం బసుల
బాలగ దోలుట బంటు పంతమే
చాలు వృషాసురేంద్ర బల
సంపద చూపగ నెల్లబోటి గో
పాలుర మందగాదు చన
బైపడితేని బ్రచండ కృష్ణ శా
ర్దూలము నేడు నీ గళము
ద్రుంపక చంపక పోవనిచ్చునే"

[ అని అంటూనే, కృష్ణయ్య ముందుకు ఉరికాడు. బలరాముడు అతణ్ణి అనుసరించాడు. ]



## ★ 3. వ రంగం ★

[ మందలో గొడ్లు చెల్లాచెదరై ఉన్నై. వృషభాసురుడు గంభీరంగా ఱంకెలు వేస్తూ అక్కడ తిరుగుతున్నాడు. అంత లోనే, కృష్ణయ్య, అక్కడకు వచ్చాడు.

వృషభాసురుడు కృష్ణయ్యను చూశాడు; వెంటనే, అతని మీదికి ఉరికాడు.

అంతవరకు, కొండమాదిరి నిలబడి ఉన్న కృష్ణయ్య, వృష భాసురుడు చేరువకు రాగానే, కొంచెం ప్రక్కకు తప్పుకుని నుంచున్నాడు. దాంతో, వృషభాసురుని తల, అక్కడున్న ఒక చెట్టుకు 'ఢీ' కొట్టుకుంది.

తిరిగి వృషభాసురుడు కృష్ణయ్య మీద కలియబడ్డాడు. ఆ వెంటనే కృష్ణయ్య వానిమీదికి యెగిరాడు; అతని కొమ్ములు ఊడబెరికాడు; వాటితోనే, అతని మెడలో, యిష్టం వచ్చినట్టల్లా పొడిచాడు. ఆ బాధకు తాళుకోలేక వృషభాసురుడు, అమితంగా ఱంకెలు వేసి నేలకొరిగాడు.

అంతలో, నందుడు ముందుకు వచ్చాడు. నందుని చూడ గానే,కృష్ణయ్య, వృషభాసురుని మీదినుంచి దిగి, చిరునవ్వులు చిందుతూ నుంచున్నాడు. మరుక్షణంలో, నందుడూ కృష్ణయ్యా ఒకటై పోయినారు.

అలా కలుసుకున్న నందుడు అమితమైన సంతోషంతో కృష్ణయ్య మీద ముద్దుల వర్షం కురిపించాడు; ఆనంద బాష్పాలతో, అతణ్ణి, నఖశిఖ పర్యంతం తడిపేసాడు. ]

**నందుడు:** ...కృష్ణా...! కృష్ణా...!! మమ్మల్ని బ్రతికించావు నాయనా! మందకు, తిరిగి, ప్రాణంపోశావు, బాబూ! కృష్ణా...! కృష్ణా...!

[ అంటూ, తిరిగి, అతనిని హృదయానికి హత్తుకున్నాడు. ]



## ★ ముఖ్య పాత్రలు ★

1. కృష్ణయ్య
2. బలరాముడు
3. నారదుడు
4. కంసుడు
5. కేశి
6. వ్యోముడు



# కేశివ్యోమ సంహారం

## ★ 1. వ, రంగం ★

[ కంసుడు, తన ఆలోచనా మందిరంలో కూర్చుని, నారదునితో ముచ్చటిస్తున్నాడు. ]

**నారదుడు:** ఊఁహుఁ! అధికారమైతే ఉంది ; యేం లాభం...? దాన్ని మించిన అమాయకత్వం ఉందిగా!

[ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ, కంసుడు, తల వంచుకుని ఉన్నాడు. ]

...అపాయం కలగకుండా అల్లుళ్లను చంపాను గదా అనుకుంటున్నావు. అంతేనా...?

[ కంసుడు, 'ఔ' నన్నట్టుగా తల ఆడించాడు. ]

...మాయ అంటేనే అది. శ్రీహరిచేస్తున్న మోసాల్లో అది పెద్ద మోసం!

[ కంసుడు, 'ఊఁ ...! అలాగా?' అన్నట్టు తల పంకించాడు ; వేడి నిట్టూర్పు విడిచాడు. ]

... ఆ నల్లనయ్య నంద యశోదలకు పుట్టాడనే మీ అభిప్రాయం. అది పొరబాటని యెంతమంది యెన్ని సార్లు చెప్పినా మీకు అర్థం కాదు!

[ కంసుడు ఆదో విధమైన అశాంతితో నారదుని వంక చూశాడు. ]

... కంసా! యిప్పటికైనా నామాట విను! నిన్ను సంహరించటానికే శ్రీహరి నిశ్చయించుకున్నాడు. ఆకాశవాణి చెప్పినట్టు ఆయన దేవకీ వసుదేవులకే పుట్టాడు. కాని, నీ కళ్లుకప్పి నందుని యిల్లు చేరుకున్నాడు ; నల్లనయ్యగా పెరుగుతున్నాడు.

[ కంసునిలో కలవరం అమితమై పోయింది. వెంటనే అతను లేచి నుంచున్నాడు ; ఏదో నిర్ణయానికి వచ్చినట్టుగా తల పంకించాడు. ]

... మరో విషయం ! బలరాముడు కూడా నీ మేనల్లుడే అని నీకు తెలుసు. అయినా అతను నీకు విరోధి కాడని నీ విశ్వాసం. అంతేగా ?

[ 'అదీ పొరబాటేనా ?' అన్నట్టు కంసుడు నారదుని వంక చూశాడు. ]

...ఊఁహూఁ ! అంతకు మించిన భ్రమ మరొకటి లేనే లేదు. అతను సామాన్యుడనుకుంటున్నావు ; కానీ కాదు. ఎన్నటికీ కాదు. ఆ నల్లనయ్యకు అండగా ఉండటానికే అతను పుట్టాడు. కాకపోతే, రోహిణి కడుపున పడ్డాడు ; అంతే !

కంసుడు: హరి హరీ ! ఎంత మోసం, యెంత మోసం ? నావాళ్లే నన్ను యింతగా మోసం చెయ్యటమా ?

[ అంతలో అతనికేదో సందేహం కలిగినట్టయింది; అందు కనే నారదుని వంక చూశాడు. ]

... అయినా ... నారదా ... ! వసుదేవుడు మా ఖైదులో ఉన్నాడు. రోహిణి మందలో ఉంది. మరి, నువ్వు చెప్పింది ...

నారదుడు: ( వికటంగా నవ్వి )

... అసురాధిపతికి, 'ఇది, అసంభవంగా ఉందే' అని పిస్తోంది. అంతేనా ... ?

[ కంసుడు, 'అంతే !' అన్నట్టుగా తల ఆడించాడు. ]

మహారాజా ... ! మాయ అంటే యేమనుకుం టున్నారు ? అదే !

[ కంసుడు నారదుని వంక వెట్టిగా చూశాడు. ]

... శ్రీహరి ఆజ్ఞ మీద యోగమాయ ఆపని చేసింది. చేసి, నంగనాచి మాదిరి నందుని సుందరికి కూతురై పుట్టింది. వసుదేవుడు, దేవకీదేవికి పుట్టిన నల్లనయ్యను నందుని యింట్లో ఉంచి, యశోద కన్న ఆడపిల్లను యిక్కడకు తీసుకొచ్చాడు. మీరు, ఆవిడ మీ కోడలే అనుకున్నారు. అనుకుని చంపటానికి ప్రయత్నించారు. అంతలో ఆమె ఆకాశానికి యెగిరి పోవటమూ, ఆరని మంటను మీలో కల్పించటమూ జరిగింది. అదంతా మీకు తెలిసిందేగా!

కంసుడు: ( చకితుడై )

... ఘోరం! ఘోరాతి ఘోరం! నమ్మిన వాళ్లను నరకట మంటే యిదేనన్న మాట! ... ఉఁహుఁ! వీళ్లకు ప్రాణదానం చెయ్యటమే పాపమై పోయింది.

నారదుడు: ( వెఱ్ఱిగా నవ్వి )

మహారాజా...! అది చేసింది మాత్రం మీరా...? కాదు. 'అదలా జరగాలి' అని ఆయన యెప్పుడో నిర్ణయించి ఉంటాడు. అందుకనే అలా జరిగింది. అంతే!

కంసుడు: ( నిప్పులు కక్కుతూ )

ఉఁహుఁ! ఆయన నిర్ణయం యెటువంటిదో మా నిర్ణయం కూడా అటువంటిదే. మరో క్షణంలో, దేవకీ వసుదేవులు మా కత్తికి బలికావాలని మేం నిశ్చయించాం. అదెలా జరిగేదీ మీరే చూస్తారు!

[ అలా అంటూనే, కంసుడు కత్తి దూసాడు; అక్కడి నుంచి కదల బోయినాడు. అది చూసిన నారదుడు కూడా భయపడి పోయినాడు. ]

నారదుడు: ... మహారాజా ...! కంస రాజేంద్రా!

[ కంసుడు ' ఏమిటి ?' అన్నట్టుగా నారదుని వంక చూశాడు. ]

... ఏమిటీ అట్టహాసం... ?

కంసుడు: మహర్షీ! ఇది అట్టహాసం కాదు; ఆచరణలోకి వస్తున్న అసురాధిపతి నిర్ణయం !

నారదుడు: నిర్ణయమా ? ...ఏమని...?

కంసుడు: కంసుని మోసగించిన దేవకీ వసుదేవులు కంసుని ఖడ్గానికే యెరకావాలీ అని ; అంతే!

నారదుడు: ... దేవకీ వసుదేవులు కంసుని మోసగించారా... ? లేదే ...! అందరినీ మోసగించినట్టే, ఆ హరి, ఆ దంపతులనూ మోసగించాడు! అందరినీ ఆవరించినట్టే, ఆ మాయ, వారినీ ఆవరించింది ! ఇందులో, వారు చేసిన దోస మేముంది ?

[ అది వింటూ కంసుడు ఆలోచనలో పడ్డాడు. ]

అసలు రహస్యాన్ని అర్థం చేసుకోకుండా, అమాయకులను హత్య చేయటమా ?

[ తన తొందర పాటును గుర్తించినట్టుగా కంసుడు తల దించుకున్నాడు. ]

... ఎంత అన్యాయం ... ? ఎంత అన్యాయం ? ఉఁహుఁ ... ! సార్వభౌములే యిలా తొందర పడితే సామాన్యుల మాట చెప్పేదేముంది ?

[ 'అయితే యిప్పుడేం చేయాలి ?' అన్నట్టుగా కంసుడు నారదుని వంక చూశాడు. ]

... ఇంతకూ, మీ ప్రాణం మీద మీకు తీపి అనేది ఉంటే, మీకు జరిగిన మోసాలకు, మీరు, ప్రతీకారం చెయ్యాలనుకుంటే, అన్నిటికీ మించి, అందుకు తగిన శక్తి సామర్థ్యాలు మీలో ఉన్నట్టయితే, మీకు

ఆగర్భ శత్రువులైన ఆ బలరామకృష్ణులను హతమార్చే పని చేయండి! అందరిచేతా 'సెబాస్' అనిపించుకోండి! పౌరుషం అంటే అది! అంతే గాని...

[ కంసుడు ఒక క్షణకాలం ఆలోచించాడు. కత్తిని, మెల్లగా ఒరలోకి దింపేశాడు; నారదుని సమీపించాడు. ]

**కంసుడు:** మహర్షుల ఉపదేశం మా మనసును మార్చేసింది; మా ధర్మాన్ని మాకు బోధించింది.

[ అలా అంటూనే, కంసుడు ఓ ప్రక్కకు చూశాడు. అంతలో, కేశి, వ్యోముడు అనే యిద్దరు రాక్షసులు అతని ముందుకు వచ్చారు. ]

... వింటున్నారా ... ?

**కేశివ్యోములు:**

... చిత్తం ... !

**కంసుడు:** రామకృష్ణులు ప్రాణాలతో ఉండటం రాక్షస రాజు సహించలేడు. అర్థమయిందా?

**కే శి:** చిత్తం! అసురాధిపతికి ఆనందం కలిగించటమే మా ధర్మం. ఆ ధర్మాన్ని మేం అక్షరాలా నెరవేర్చుకుంటాం.

[ కంసుడు, సంతృప్తితో నారదుని వంక చూశాడు. నారదుడు, 'నారాయణ! నారాయణ!" అంటూ, మందహాసం చేశాడు. ]



## ★ 2. వ, రంగం ★

[ ఆది బృందావనం పొలిమేరలో ఉన్న అడవి. అక్కడ, ఒకచోట, కృష్ణయ్య, వేణువు నూదుతూ నుంచున్నాడు. గోపకులు ఆతనిచుట్టూ చేరి ఆనంద తాండవం చేస్తున్నారు. వారికి కొంచెం దూరంలో చెట్ల చాటున నుంచుని కేశివ్యోములు వారివంకనే చూస్తున్నారు. ]

**కే శి:** ...అదుగదుగో... వాడే నల్లనయ్య !

**వ్యోముడు:** ...అయితే...బలరాము డేడీ ?

**కే శి:** ( పరీక్షగా చూస్తూ )

... ఆ చెట్టుక్రింద, దూడని బుజ్జగిస్తున్నాడు చూడు...వాడే అయిఉంటాడు !

**కృష్ణయ్య:** ( మురళి వాయించటం ఆపి, గోపకుల నుద్దేశించి )

...అన్నయ్య యేడీ ?

**గోప బాలుడు:** 1.

ఆయనకు ఆవులమీదా దూడలమీదా ఉన్న మోజు ఆట పాటల మీద లేదు !

[ పిల్లలందరూ పక పక లాడారు. ]

2. అంతే అంతే...! అంటే ముట్టనట్టు అక్కడెక్కడో కూర్చుని, ఆవుదూడలతో ఆడుకుంటున్నాడు !

[ కృష్ణయ్య ఆటుగా చూసి చిరునవ్వు నవ్వాడు. ఆ వెంటనే మురళి వాయించటం మొదలు పెట్టాడు.

తన అభిప్రాయం సరైనదే అన్నట్టుగా కేశీ, వ్యోముడూ తలలు పంకించారు. ]

**వ్యోముడు:** ...ఉన్న పాళంగా వాళ్లమీద పడితే...?

కేశి: ఏమీం లాభంలేదు. వాళ్లను విడదీసి, యిక్కడ కొందరినీ అక్కడ కొందరినీ హతమార్చాలి. అదీ సరైన పద్ధతి!

వ్యోముడు: అయితే సరే...! నువ్వు కృష్ణయ్య పనిచూడు; మిగిలిన వాళ్ల విషయం నేను చూసుకుంటాను.

[ 'సరే' అన్నట్టు కేశి, తల ఆడించాడు. ఏదో కొంచెం ఆలోచించి, అక్కడి నుంచి కదిలి వెళ్లాడు.

మరు క్షణంలో, మందవేపునుంచి గుఱ్ఱం సకిలించిన ధ్వని అయింది. ఆ వెంటనే, మందలో యేదో అలజడి అవుతున్నట్టు అనిపించింది.

కృష్ణయ్య మురళి వాయించటం ఆపాడు; అటు దిక్కుగా చూశాడు. ]

కృష్ణయ్య: ...ఈ అడవిలో గుఱ్ఱాలున్నయ్యా?

[ 'లేవే' అన్నట్టుగా బలరాముడు తల ఆడించాడు. 'అదేదో వింతగా ఉన్నదే' అన్నట్టు మిగిలిన వాళ్లు ఒకళ్లవంక ఒకళ్లు చూసుకున్నారు. ]

...అయితే యిది...

బలరాముడు:

ఏముంది...? మరో మోసమై ఉంటుంది!

[ అంతలో "కృష్ణా...కృష్ణా" అన్న ఆర్తనాదం వినిపించింది. కృష్ణయ్య అటుగా పరిగెత్తాడు. పరిగెత్తుతూనే ... ]

కృష్ణయ్య: మీరిక్కడే ఉండండి... నే నిప్పుడే వస్తాను!

[ గోపకులు భయంతో ఒకరి వంక ఒకరు చూసుకున్నారు. ]

బలరాముడు:

ఏం ఫరవాలేదు! రోజులు తీరిన రాక్షసు డెవడో అక్కడికి వచ్చి ఉంటాడు; అంతే!

[ 'అంతే అయి ఉంటుంది' అన్నట్టుగా గోపకులు తలలూపారు; కృష్ణయ్య వెళ్లిన వేపుగా చూస్తూ నుంచున్నారు. ]



## ★ 3. వ్రరంగం ★

[ మందలో యెక్కడ చూసినా కల్లోలమే కనబడుతోంది. ఒక పెద్ద గుఱ్ఱం, వీథి మధ్య నుంచుని, పిచ్చిదాని మాదిరి చిందులు త్రొక్కుతోంది.

అంతలో, కృష్ణయ్య అక్కడకు వచ్చాడు. అతణ్ణి చూడ గానే ఆ గుఱ్ఱం విపరీతంగా సకిలించింది.

ఆ వెంటనే, కృష్ణయ్య, ఆ దగ్గరలోనే ఉన్న పొగడచెట్టు యెక్కాడు. అది చూసిన గుఱ్ఱం, పగ పట్టిన పాము మాదిరి ఆ చెట్టు దగ్గరకు దూసుకు వెళ్ళింది; అక్కడే నుంచుని, కృష్ణయ్య వంక చూస్తూ, భీకరంగా సకిలించింది.

అది చూసిన కృష్ణయ్య, కొంచెంగా క్రిందకు వంగి దాన్ని ఒక చెంపకాయ కొట్టాడు. దాంతో, దాని పళ్లన్నీ రాలి పోయినై. అది అమితమైన బాధతో నోరు తెరిచింది. ఆ వెంటనే, కృష్ణయ్య, దాని నోట్లోకి తనచేతిని పోనిచ్చాడు.

కృష్ణయ్య ఆలా చేయటంవల్ల, ఆ గుఱ్ఱానికి ఊపిరాడలేదు. అది కొంతసేపు అటూ యిటూ కదలలేక పోయింది. ఆ పరి స్థితి గ్రహించిన కృష్ణయ్య సగర్వంగా నవ్వాడు.

ఆ తరువాత కొంతసేపటికి, ఆ గుఱ్ఱం, యెలాగో కొంచెం వెనక్కు వెళ్ళింది. అయితే యేం? దాని తల తిరిగిపోయింది. అది గిఱ్ఱు గిఱ్ఱున తనచుట్టూ తాను తిరగటం మొదలుపెట్టింది. అంతలో, కృష్ణయ్య చెట్టుమీంచి క్రిందికి దిగాడు. దిగీ దిగటంతోటే, ఆ గుఱ్ఱాన్ని సమీపించి, ఒక్క తన్ను తన్నాడు. కృష్ణయ్య తన్నిన తన్నుతో, ఆ గుఱ్ఱం, ఆకాశానికి యెగిరింది. ఆలా యెగురుతూ, అది అతిభీకరంగా అరిచింది. ఆ అరుపు, బృందావనంలోనే కాదు, ఆ చుట్టు ప్రక్కల గ్రామాల్లో

కూడా, మారు మ్రోగింది. మరుక్షణంలో, అక్కడే యెక్కడో, ఒక పెద్ద కొండ కూలిన మ్రోత అయింది.

ఆ వెంటనే, మందలోని జనం "కృష్ణా...! కృష్ణా...!" అని అరుస్తూ కృష్ణయ్యను సమీపించారు. అంతవరకూ కృష్ణయ్యలో ఉన్న కోపం ఒక్కసారిగా చల్లారి పోయింది. ఆయన, వాళ్లను చూసి, చిరునవ్వు నవ్వాడు. ]



## ★ 4. వ, రంగం ★

[ బలరామునితోపాటు ఉండిపోయిన గోపబాలు రందరూ, ఆశ్చర్య సంభ్రమాలతో, చప్పట్లు చరుస్తున్నారు. ]

**గోప బాలుడు:**

1. ...ఉఁహుఁ! కృష్ణయ్యతో పోట్లాడటమంటే మాట లనుకున్నాడు కాబోలు; పాపం!

2. రాక్షసుడికి అంతకుమించిన ఆలోచన యెలా తడుతుంది?

3. అది కాదు. మర్యాదగా వచ్చి, మనతోపాటు ఉంటే, యెంత హాయిగా బ్రతకవచ్చూ; అని!

4. నిజమే. కాని, అప్పుడు, వాళ్ల మోసాలూ వేషాలూ యేంకావాలో చెప్పు!

1. మంచి మాటన్నావ్!

2. ( మీసం మెలేస్తున్నట్టు నటిస్తూ )
"మేము రాజుగారి స్నేహితులం. గొడ్లనుకాచుకునే గొల్లలతో కలిసి మెలిసి ఉంటామూ? చస్తే ఉండం"

[ అది విని, బలరాముడు మందహాసం చేశాడు. గోప బాలురు కొందరు పకపక లాడారు. ]

3. బ్రతికి బాగుపడే గీత మొహాన లేకపోతే యెలా ఉంటారు...? ఉండనే ఉండరు!

[ ఆ ప్రక్కనే ఉన్న వ్యోముడు ఆ మాటలు విన్నాడు. విని, 'నవ్వండిరా...నవ్వండి!' అన్నట్టుగా తల ఆడించాడు. ]



## ★ 5. వ, రంగం ★

[ అదొక కొండ గుహ. ఆ గుహను సమీపించి వ్యోముడులోపలకు చూశాడు. చూసి, సంతృప్తిని ప్రకటిస్తూ, తల పంకించాడు; ఆ వెంటనే వికటాట్టహాసం చేశాడు. అలా వికటాట్టహాసం చేస్తూ, వ్యోముడు, గుహలోకి వెళ్లాడు. వెళ్లినట్టే వెళ్లి, మరుక్షణంలో కృష్ణయ్య రూపంలో బయటికి వచ్చాడు.

అలా బయటకు వచ్చిన వ్యోముడు ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ, ఒకసారి, తన వేషాన్ని తను చూసుకున్నాడు ; చూసుకుని మురిసిపోయినాడు. ఆ వెంటనే అతను వేణువు ఊదసాగాడు. ]



## ★ 6. వ, రంగం ★

[ బలరాముడూ గోపబాలురూ మురళీధ్వని విన్నారు. విని, అటుగా చూశారు. ]

**గోప బాలుడు:**

1. అదుగో...వినిపిస్తోందా...?
2. అప్పుడే అక్కడి కెలా వెళ్లాడో...?
3. ఏముంది...? ఆ గుజ్జప్పు రాక్షసుణ్ణి అటు ఆకాశానికి యెగరేశాడు ; ఆయనేమో యిటు అడవిలో వచ్చి వ్రాలాడు. ఆయనకు చేతగాని దేముంది ?

[ అంతవరకూ, యేదో అనుమానంతో ఆలోచిస్తున్న బలరాముడు, ఆ మాట విని, చిరునవ్వు నవ్వాడు. ఆ వెంటనే అక్కడినుంచి, ఆ వేణునాదం వినిపిస్తున్న వేపుగా కదిలాడు. గోపబాలు రందరూ అతణ్ణి అనుసరించారు. ]



# ★ 7. వ, రంగం ★

[ కొండ గుహదగ్గర, కృష్ణయ్య వేషంలో, వ్యోముడు నుంచుని ఉన్నాడు ; మురళి మ్రోయిస్తున్నాడు. అంతలో, బలునితో పాటు గోపబాలురు అక్కడకు చేరుకున్నారు.

వారిని చూడగానే, ఆ మాయకృష్ణుడు గుహలో ప్రవేశించాడు. వారూ అతనితో పాటు లోపలకు వెళ్లారు.

మరు క్షణంలో, వ్యోముడు, తిరిగి గుహబయటకువచ్చాడు. వచ్చి, ఒక పెద్ద కొండను తెచ్చి, ఆ గుహకు అడ్డుగా పడేశాడు. ఆ వెంటనే, వికటంగా పెద్ద నవ్వు నవ్వాడు. ]

**వ్యోముడు:** ఊఁ...యిహ నవ్వండి! నవ్వి నవ్వి ఊపి రాడక చావండి!

[ అలా అంటూనే, అతను, తిరిగి వెట్టిగా నవ్వసాగాడు. అదే సమయానికి, కృష్ణయ్య అక్కడకు వచ్చాడు. వచ్చి, తన మాదిరిగానే ఉన్న వ్యోముణ్ణి చూశాడు. ఆ వెంటనే, మెల్ల మెల్లగా వ్యోముని వెనక్కు వెళ్లాడు; వెడుతూనే వ్యోముని మీదికి ఉరికి అతని భుజాల మీద యెక్కి కూర్చున్నాడు.

అనుకోకుండా జరిగిన ఆ పనికి, వ్యోముడు అదలి పోయినాడు; ప్రాణభయంతో ఒక పెద్ద కేక పెట్టాడు. ]

**కృష్ణయ్య:** ఉఁహుఁ...! మారు వేషంలో వచ్చి మా వాళ్లని మోసంచేస్తావా? ఊఁ...? మోసంచేసి, బ్రతికిబయట పడాలనేనా నీ అభిప్రాయం?...నవ్వవేం...? నవ్వు!!

[ అంటూ, తిరిగి ఒక పిడిగ్రుద్దు గ్రుద్దాడు. ఆ బాధను తట్టుకోలేక వ్యోముడు, ప్రాణాలు యెగిరిపోయినట్టుగా అరిచాడు. ]

...అరిస్తే యేం లాభం? పద...! అటు పద...! అటు...అటు!

[ అంటూ, కృష్ణయ్య, వ్యోముని గుండెల్లో తన్నాడు. వ్యోముడు బాధతో అరుస్తూనే, కృష్ణయ్య చూపిన వేపుగా వెళ్లాడు. అంతలో, 'కృష్ణా ..కృష్ణా' అన్న ఆర్తనాదం, ఆ గుహలోపలినుంచి వినిపించింది. ఆవెంటనే, కృష్ణయ్య, వ్యోముని మీద ఉండే, ఆ కొండను ఒక్క తన్ను తన్నాడు. దాంతో, అది యెగిరి అవతల పడ్డది. మరుక్షణంలో బల రాముడూ, గోపబాలురూ బయట పడ్డారు. ఆ వెంటనే కృష్ణయ్య, క్రిందకు దూకి, వ్యోముని ముందు నుంచున్నాడు. ]

కృష్ణయ్య: బుద్ధొచ్చిందా ? ఊఁ...? బుద్ధొచ్చిందా అంట !

[ వ్యోముడు 'ఆహాఁ ! అన్నట్టు తల ఆడించాడు. ]

ఊఁ...అయితే...పో !

[ అంటూ, వాడి పొట్టలో ఒక్క పోటుపొడిచాడు. దాంతో వ్యోముడు, 'కృష్ణా...!' అంటూ; నేల కొరిగాడు.

ఆ వెంటనే, అతనిలోనుంచి ఒక వెలుగు బయలుదేరి, కృష్ణయ్యను సమీపించింది ; ఆయనలో కలిసి పోయింది. ]

గోప బాలుడు:

1. ...ఇదేమిటి...?

2. ఏముంది...? వాడు మోసంకోసమయినా మన కృష్ణయ్య వేషం వేసుకున్నాడు. తనే కృష్ణయ్య అనుకుని కొంతసేపు తిరిగాడు. అన్నిటికీ మించి, చచ్చిపోతూ, "కృష్ణా...!!" అని, హృదయపూర్వకంగా అరిచాడు. అంతకంటె యేం కావాలి ? ఆ పుణ్యమే, వాడికి, పునర్జన్మ లేకుండా చేసింది ; కృష్ణయ్యలో కలిసిపోయే అదృష్టాన్నిచ్చింది. అంతే !

[ అది విన్న గోపబాలురు, తన్మయత్వంతో, 'కృష్ణా... ! కృష్ణా ..!" అంటూ కృష్ణయ్యముందు సాగిల బడ్డారు. కృష్ణయ్య వారి వంక, ప్రేమతో చూశాడు.
అంతలో, బలరాముడు ముందుకు వచ్చాడు; వెంటనే 'కృష్ణా...!' అంటూ, అతణ్ణి చుట్టేసుకున్నాడు. ]



# ★ ముఖ్యపాత్రలు ★

1. కృష్ణయ్య
2. బలరాముడు
3. కంసుడు
4. చాణూరుడు
5. ముష్టికుడు
6. అక్రూరుడు
7. నారదుడు
8. నందుడు
9. ఉపనందుడు
10. సుదాముడు
11. కుబ్జ
12. దేవకి
13. వసుదేవుడు



# కంస వధ

## ★ 1. వ, రంగం ★

[ అది మధురానగరంలో కంసుని మందిరం. కంసుడు కొలువు దీరి ఉన్నాడు. అతనికి రెండు ప్రక్కలా అతని మంత్రులూ సేనాపతులూ స్నేహితులూ ఆశీనులై ఉన్నారు. ]

**కంసుడు:** ఉఁహుఁ !

" ఎందుఁ న న్నెదిరించి పోరుటకు దే
వేంద్రాదులుం జాల రీ
బృందారణ్యము మంద నిప్పుడు మదా
భీరార్భకుల్ రామ గో
విందుల్ వర్ధిలుచున్న వారట రణో
ర్విం గంసుమర్దింతు మం
చుం దర్పంబులు వల్కుచుందురట యీ
చోద్యంబులన్ వింటిరే !"

[ సభికు లందరూ ఒకరి వంక ఒకరు ఆశ్చర్యంతో చూసు కున్నారు. ]

**మంత్రి: 1.** మహారాజా! వాళ్లు ఉట్టి ఉన్మాదులైనా అయి ఉండాలి; లేదా, వాచాలు రయినా కావాలి. అంతే!

[ సభికులు, కంసునితో సహా, పక పకా నవ్వారు. ]

**చాణూరుడు:**

...మందలో పుట్టి మందలో పెరిగే వాళ్లకి మధురానగర మంటే యేం తెలుస్తుంది ... మహా రాజంటే యేం అర్థమౌతుంది ?

[ తిరిగి అందరూ నవ్వారు. ]

**ముష్టికుడు:** వాళ్లు వగసిరి కలవాళ్లే కావచ్చు; కాని, మహా రాజుల దగ్గిర మల్లు లున్నారని తెలిస్తే మాత్రం అలా మాట్లాడేవాళ్లు కాదు!

**సేనాపతి:** అర్భకుల మాటలు అంతగా పాటించటం అనవసర మనుకుంటాను!

**కంసుడు:** ...అలా అనటానికి వీల్లేదు. వాళ్లు మానవమాత్రులు కారనీ దానవసంహారానికే పుట్టారనీ అందరూ అను కుంటున్నారు!

**మంత్రి: 2.** మరి...మహారాజుల అభిప్రాయం...?

**కంసుడు:** అందుకు భిన్నంగామాత్రం లేదు. అందుకనే వారికి తగిన శాస్తి చెయ్యా లనుకుంటున్నాం!

**సభికులు:** ( ఏక కంఠంతో )

...మహారాజులు 'ఊఁ...!' అంటేచాలు, మరు క్షణంలో వాళ్లని మాయం చేసేస్తాం!

**కంసుడు:** (అమితమైన సంతోషంతో)

...అది మాకు తెలుసు. అయినా, యిప్పుడు, అది మన అభిప్రాయమని ప్రపంచం అనుకోరాదు. ఏదో ఒక మిషమీద, వాళ్లను యిక్కడికి రప్పించాలి. వచ్చిన వాళ్లను, యేదో విధంగా ఉసికొల్పి, పోట్లా టకు దింపాలి. అప్పుడు మీమీ ప్రతాపాలు చూపిం చాలి; మా మెప్పు పొందాలి. అదీ...మా కోరిక!

[ ఆ మాటలు విన్న సభ్యులందరూ, 'కంస మహారాజేంద్రు నకూ...జై' అన్న నినాదం చేశారు. ]

ఆ ఆశయం సిద్ధించాలీ అంటే...

**మంత్రి: 3.** ఏముంది...? మహారాజులు ధనుర్యాగం చేయాలని, యెలాగూ అనుకుంటూనే ఉన్నారు. అది చూడ

టానికి రమ్మని, వారి నాహ్వానిస్తే చాలు, ఆపైపనంతా మన మల్లులు చూసుకుంటారు.

[ ఆ అభిప్రాయాన్ని ఆమోదించినట్టుగా కంసుడు తల ఆడించాడు. ]

చాణూరుడు:

అంతే అంతే...! ఆ సందర్భంలోనే మల్లయుద్ధ ప్రదర్శనం ఒకటి యేర్పాటు చేయిస్తే, ఆ పైన...!

మంత్రి: 1. చెప్పేదేముంది? అది, ఆహ్వానితులకు ఆనందాన్ని కల్పించినట్టూ అవుతుంది; ఆ రామకృష్ణులను పోరాటానికి పురికొల్పినట్టూ అవుతుంది!

[ చాణూర ముష్టికులు ముసి ముసి నవ్వులు నవ్వుతున్నారు. కంసుడు వారివంక సంతృప్తితో చూశాడు. ]

కంసుడు: అంతే కాదు. మన ఆశయం సిద్ధించటానికి అదొక మంచి అవకాశం కూడా అవుతుంది!

[ 'ఔను'న్నట్టుగా సభికులు తల లూపారు. కంసునికి మరి కొంత ఉత్సాహం కలిగింది. ]

చాణూరుడు:

ఆ విధంగా అయినా మహారాజులకు మనశ్శాంతి నివ్వ గలిగితే మా జీవితాలు ధన్యమైనట్టే!

ముష్టికుడు: అందులో సందేహం యేమీ లేదు!

" విన్నాణంబుల బోరనేర్తురు మహా
వీర్య ప్రతాపాది సం
పన్నుల్ మీరలు మేటిమల్లుగములం
బ్రఖ్యాతులై పెంపుతో
మన్నా రా బలకృష్ణులం బెనకువన్
మర్దించి మత్ప్రీతి కా

సన్నుల్ గండు పురీజనుల్ వాగడనో
చాణూర యో ముష్టికా !"

**చాణూర ముష్టికులు:**
మహారాజులకు సంతోషం కలిగించటానికి మా ప్రాణాలయినా అర్పిస్తాం!

**కంసుడు:** ( సంతోషంతో )
సెబాస్...! రాజభక్తి అంటే అలా ఉండాలి!
( మరో ప్రక్కకు తిరిగి )
...అంబష్టా !
[ అంబష్టుడు ముందుకు వచ్చి సవినయంగా నుంచున్నాడు. ]
...మన పట్టపు టేనుగు బాగా మదించి ఉంది కదూ!

**అంబష్టుడు:** ఔను మహారాజా !

**కంసుడు:** దాన్ని నువ్వు మన సింహద్వారంలో నిలబెట్టాలి. ఆ బలరామ కృష్ణులు రాగానే, దాన్ని వారిమీదకు ఛీ కొలపాలి. అందులో నువ్వు యేమాత్రపు చాక చక్యాన్ని ప్రదర్శించినా, మన మల్లులు, కడుపులో నీళ్లు కదలకుండా ఉండి పోతారు. వారలా ఉండా లనే మేం మనసారా కోరుతున్నాం. వింటున్నావా?

**అంబష్టుడు:** చిత్తం! తమ ప్రేమకు పాత్రుణ్ణి కావటానికి శాయ శక్తులా ప్రయత్నిస్తాను!

**కంసుడు:** ( తన ప్రక్కనే ఉన్న అక్రూరుని వంకచూస్తూ )
...అక్రూరా !
[ అక్రూరుడు 'ఏమిటి ?' అన్నట్టు కంసుని వంక చూశాడు. ]
బలరామ కృష్ణులకు నువ్వంటే అమితమైన అభిమానం. అది మాకు తెలుసు. అందుకనే, వారిని యిక్కడికి తీసుకు వచ్చే బాధ్యత నీమీద పెడుతున్నాం!

**అక్రూరుడు:**

...స్నేహితుని కోరిక చెల్లించటం కంటె శ్రేష్ఠమైన కార్య మేముంటుంది ? కాకపోతే, మనసులో ఉన్న మాట మనవి చేసుకోవటం నా ధర్మం అను కుంటాను.

[ 'ఏమిటది ?' అన్నట్టు కంసుడు అతనివంక చూశాడు. ]

ఏమీ లేదు...

" పంపిన బోనివాడనె నృపాలక... ?"

కాకపోతే...

'...మానవు లెన్న దమ్ము నూ
హింపగు దైవయోగముల
నించుక గానరు తోచినట్లు ని
ష్కంపగతిం జరింతు రది
గాదన వచ్చునె యీశ్వరేచ్ఛ ద
ప్పింపగ రాదు...'

అయినా...

'నీ పగతు బిడ్డల దెచ్చెద
బోయి వచ్చెదన్"

**కంసుడు:** ( చిరునవ్వుతో )

...అక్రూరా...! ఈశ్వరేచ్ఛ యేమిటో మాకు తెలుసు. దాన్ని యేవిధంగా వమ్ము చేయాలో కూడా మాకు తెలుసు. ఆ విషయంలో నువ్వు సంకోచ పడవలసిన పని యేమీ లేదు.

[ అక్రూరుడు అతనికి గౌరవం చూపాడు. సభికు లందరూ, ఆ వెంటనే, ' రాక్షసవంశోద్ధారకునకూ ... జై ', ' కంస సార్వభౌమునకూ ... జై " అన్న నినాదాలు చేశారు. కంసుడు సగర్వంగా తల ఆడించాడు. ]



## ★ 2. వ రంగం ★

[ నారదుడు లోక సంచారానికి బయలుదేరాడు. ]

**నారదుడు:** ...లీలా మానుష విగ్రహా!

“ జగదీశ యోగీశ సర్వభూతాధార
సకల సంపూర్ణ యీశ్వర మహాత్మ
కాష్టగత జ్యోతి కైవడి నిఖిల భూ
తములందు నొకడవై నీవు మాయ
సద్గూఢుడవు గుహాశయుడవు సాక్షివి
నీయంతవాడవై నీవు మాయ
గూడి కల్పింతువు గుణముల వానిచే
బుట్టించి రక్షించి పొలియ సేయు
దీ ప్రపంచ మెల్ల నిట్టి నీ విప్పుడు
రాజమూర్తు లయిన రాక్షసులను
సంహరింప భూమి చక్రంబు రక్షింప
నవతరించినాడ వయ్య కృష్ణ!”

[ అని పాడుకుంటూ సాగిపోతున్నాడు. ]



## ★ 3. వ, రంగం ★

[ అదొక అడవి అక్కడ గోపబాలురు కొందరు గోవత్సలను మేపుతున్నారు.

అంతలో, దూరంనుంచి, ఒక రథం వస్తున్న ధ్వని అయింది. వారు అటే చూడసాగారు. ]

అక్రూరుని గొంతు:

" ఎట్టి తపంబు సేయబడె
నెట్టి చరిత్రము లభ్య మయ్యెనో
యెట్టి ధనంబు లర్థులకు
నీ బడెనో తొలి బాముునందు నా
యట్టి వివేకహీనునకు
నాది మునీంద్రులు యోగదృష్టులం
బట్టగ లేని యీశ్వరుని
బ్రహ్మమయున్ హరి జూడగల్గెడిన్ "

" సూరులు దొల్లియే విభుని
శోభిత పాదనఖ ప్రభావళిం
జేరి భవాంధకారముల
జిక్కక దాటుదు రట్టి దేవరా
వైరము తోడనైన బిలు
వన్ నను బంచి శుభంబు సేసె ని
ష్కారణమైన ప్రేమ నిదె
కంసుని బోలు సఖుండు గల్గునే! "

**గోప బాలుడు:**

1. ...ఎవరో...కంసుని దూతల్లే ఉన్నాడు!
2. అయినా, దుర్మార్గుడు కా దనిపిస్తోంది.
3. అది తేల్చిచెప్పే అధికారం మనకే ముంది? అదంతా ఆయన పని...!
4. అంతే అంతే! అసలా ఆలోచనే మన కక్కర లేదు. మనం మంచకు వెళ్లేటప్పటికి వాడు మన మధ్య మనిషల్లే తిరుగుతూ ఉంటే మంచివాడను కుందాం...లేదో, కా దనుకుందాం! అ దొకటే గుర్తు. ఏమంటావ్?
5. అది మనకు మామూలే లేగా!

[ ఆమాట విని అందరూ విరగబడి నవ్వారు. ]



## ★ 4. వ, రంగం ★

[ అది బృందావనంలో ఒక ఉద్యానవనం. కొందరు గోపికల మధ్య కూర్చుని కృష్ణయ్య వేణువు నూదుతున్నాడు. ఆ ప్రక్కనే ఉన్న గోవత్సలు కొన్ని, మేత మాని, ఆ మురళీ ధ్వని వింటూ నుంచున్నై.

అంతలో ఒక రథం అటు వేపుగా వస్తున్న చప్పుడయింది. దానితో పాటు యేదో ప్రార్థన కూడా వారికి వినిపించింది.

కృష్ణయ్య వేణువు నూదటం ఆపి అటుగా చూశాడు. ఆ గొంతు అతనికి పరిచయమైనదిగా తోచింది; కాని, అతను యిదమిద్ధమని నిర్ణయించుకోలేక పోయినాడు. అందుకనే 'ఆ దెవరా?' అన్న ఆలోచనలో పడ్డాడు. ]

**అక్రూరుని గొంతు:**

" ఇతడా కంసునిచేత బంపువడి నన్
హింసింప నేతెంచి నా
డతి దుష్టుండని చూచునో సకల భూ
తాంతర్బహిర్మధ్య సం
గతు డౌటన్ దలపోసి నన్ను సుజనుం
గా జూచునో యెట్టి యు
న్నతి గావించునో యే క్రియం బలుకునో
నా భాగ్య మెట్లున్నదో "

[ అది విన్న కృష్ణయ్య ముఖం విప్పారింది. ఆ వెంటనే అతను గోపికలను ప్రక్కకు తోసుకుంటూ ఆ గొంతు వినిపిస్తున్న వేపుగా వెళ్లాడు. బలరాముడూ గోపికలూ అటే చూస్తూ నుంచున్నారు.

అంతలో రథం ఆగిన ధ్వని అయింది. గోపికలు ఆశ్చర్యంతో అటు దిక్కుగా చూశారు. ]

**గోపిక:** 1. . . . ఎవరో మహానుభావుడల్లే ఉన్నాడు !

**బలరాముడు:** (కల్పించుకుని)

. . .ఎవరో కాదు. . .అక్రూరుడు. ఓ మహాభక్తుడు.

**గోపిక:** 2. ఓ. . .అలాగా ?

[ ఔనన్నట్టుగా బలరాముడు తల ఆడించాడు. ]

3. అంత భక్తుడు కాబట్టే కృష్ణయ్య ఆయన్ని అంతగా గౌరవిస్తున్నాడు.

[ గోపిక లందరూ 'ఔనౌన'న్నట్టుగా తలలూపారు. అంతలో కృష్ణయ్యా అక్రూరుడూ అక్కడికి వచ్చారు. బలరాముడు చిరునవ్వుతో అక్రూరునికి స్వాగతం చెప్పాడు.

ఆ వెంటనే అక్రూరుడు బలరాముని పాదాలు తాకాడు.

బలరాముడు అమితమైన అభిమానంతో అతణ్ణి లేవనెత్తాడు. ]



## ★ 5. ప్రరంగం ★

[ అది నందగోపుని యిల్లు. అక్కడ నందుడూ ఉప నందుడూ యేదో ముచ్చటించు కుంటున్నారు. ]

**ఉపనందుడు:**

చక్రిని మన మధ్య పెట్టుకుని కూడా శకునాలకు భయ పడితే యెలా?

**నందుడు:** ఆ భయం నన్ను గురించి కాదు; మన నల్లనయ్యను గురించి! మళ్లీ యేం ముంచుకు వస్తుందో అని!

[ అంతలో అక్రూరునితో సహా కృష్ణ బలరాములు ప్రవేశించారు.

నందుడూ ఉపనందుడూ వాళ్లను చూశారు. చూసి, లేచి నుంచున్నారు.

ఆ వెంటనే అక్రూరుడూ నందుడూ ఒకరి నొకరు ఆలింగనం చేసుకున్నారు. ]

...అక్రూరా! నిన్ను చూస్తే నా బాల్య మిత్రుడు వసుదేవుణ్ణి చూసినట్టుగా ఉంది. ఇంతకూ మధురలో మనవాళ్లందరూ క్షేమంగా ఉన్నారా?

**ఉపనందుడు:**

ఆ మాట అడగటం దేనికి?

"చెలిమలు మొఱయిడ నల్లుర
బలుడై పొరిగొనిన యట్టి కంసుడు బ్రతుకం
గలదే మనకు దశార్హుల
కిలపై యట గలుగు నేమ మేమున వచ్చున్"

[ ఆ మాటవిన్న అక్రూరుడు తలవాల్చుకున్నాడు. బలరాముడు కృష్ణయ్య వంక చూసి మందహాసం చేశాడు. ]

**బలరాముడు:**

కంసుడుమామయ్య గుర్తుకు వస్తే చాలు;
తాతయ్య ఒంటి కాలిమీద లేస్తాడు!

[ అక్రూరుడు మినహాగా అందరూ పకపకలాడారు. ]

కృష్ణయ్య: ఆ మాటలకేం గాని...

" శుభమే నీకు ప్రమోదమే సఖులకుం
జుట్టాలకున్ సేమమే
యభయంబే ప్రజ కెల్ల గోత్రజుల కా
త్మానందమే మామము
క్త భయుండే వసుదేవ దేవకులు త
త్కారా గృహంబందు ము
త్ప్రభవవ్యాజ నిబద్ధులై బ్రదికిరే
ప్రాణానిలో పేతులై"

**అక్రూరుడు:**

ఆహా! ఇతర విషయా లెలా ఉన్నా, యీ
క్షణానికి, అందరూ క్షేమంగానే ఉన్నారు.

[ నందుడూ ఉపనందుడూ, యేదో సందేహంతో, ఒకరి
వంక ఒకరు చూసుకున్నారు. ]

కృష్ణయ్య: ఊఁ...! అదే మాకు పదివేలు. ఐనా...

" నెరి నే డిక్కడ నీవు రాగ వగతో
నీతోడ నేమైన నా
కెఱుగం జెప్పు మటంచు జెప్పరు గదా
యేమందు రావార్త యే
తెఱగున్ లేదని డస్సిరో వగచిరో
దీనత్వ ముం జెందిరో
వెఱతో నా తలితండ్రు లెట్లు పడిరో
విన్పింపు మక్రూరకా!"

అక్రూరుడు:

...నేను అక్కడ బయలుదేరే ముందు వారి దర్శనం చేసుకున్నాను. మీావద్దకు వెడుతున్నానని కూడా చెప్పాను. అది విన్న వారి కళ్లు చెమ్మగిలినై. గొంతులు ఒణికి పోయినై. మాటలు తడబడ్డై. కాని,...

కృష్ణయ్య: ( ఆతృతతో )

...ఆఁ...యేమన్నారు ?

అక్రూరుడు:

"... మా నల్లనయ్యను చూసే అదృష్టం మా కళ్లకు మళ్లీ కలుగుతుందా " అన్నారు.

[ అదివిన్న నందుని కళ్లలో' నీళ్లు తిరిగినై. బలరాముడు తల వాల్చుకున్నాడు. ]

నందుడు: ...అప్పుడు నువ్వే మన్నావ్ ?

అక్రూరుడు:

( కదిలిపోయే గొంతుతో )

'...త్వరలోనే కలిగి తీరుతుంది' అన్నాను.

నందుడు: మంచిమాట అన్నావు! ...తరువాత యేమయింది ?

అక్రూరుడు:

అదివిని ఆ దంపతులు చాలా సంతోషించారు. 'సుఖంగా వెళ్లిరానాయనా !' అని నన్నుఆశీర్వదించారు.

[ అది విన్న కృష్ణ బలరాముల కళ్లు చెమ్మగిలినై. ఒక ముహూర్తం సేపు వారు అలాగే నుంచునిపోయినారు. తమ తలిదండ్రులను తలచుకుని నమస్కరించు కున్నారు. ]

నందుడు: ఇంతకూ నువ్వు వచ్చిన పనేమిటో మేం అడగనే లేదు !

అక్రూరుడు:

(సందేహిస్తూ)

...అడిగినా అడగక పోయినా చెప్పటానికి నేను సిద్ధంగానే ఉన్నాను.

ఉపనందుడు:

... ఏమిటది ?

అక్రూరుడు:

అక్కడ మా మహారాజులు ధనుర్యాగం చెయ్యబోతున్నారు. అది చూడటానికి మీ అందరినీ తీసుకురమ్మని ప్రత్యేకంగా నన్ను పంపారు.

[ నందాదులు ఆశ్చర్య పోయినారు. ]

కృష్ణయ్య: ...ధనుర్యాగమా ? దేనికి ?

బలరాముడు:

ఏదో మరో ఘోర కార్యం తలపెట్టి ఉంటాడు. దాని విజయం కోసం...

[ కృష్ణయ్య మందహాసం చేశాడు. ]

అక్రూరుడు:

అంతే అంతే ; ఘోరకార్యమే కాదు ; ఘోరాతి ఘోరమైన కార్యమే తలపెట్టాడు.

నందుడు : ( గుండె చెదిరినట్టుగా )

...ఆఁ...!

అక్రూరుడు:

ఔను. శత్రు నిర్మూలనానికి యీమాటు సర్వ ప్రయత్నాలూ చేస్తున్నాడు.

బలరాముడు:

ఉఁహుఁ! ఎవరోగాని, మామయ్యకు మంచి సలహా యిచ్చారు !

**కృష్ణయ్య:** ఎవరో యేమిటి? ఉన్నాడుగా... త్రిలోక సంచారి; ఆయనే అయిఉంటాడు!

**బలరాముడు:**
( చిరునవ్వుతో )
మహర్షుల అభిప్రాయం అదికాక పోయినా మామయ్య మనసులో మాత్రం అదలా పడి ఉంటుంది.

**నందుడు:** ఏమో...యెవరికి తెలుసు?

**కృష్ణయ్య:** అహాహా...! అన్నయ్య చెప్పిందికూడా అసంభవం కాదు. అంతే అయి ఉంటుందికూడా!
...అయితే ... అక్రూరా ...! అక్కడికి మనం యెప్పుడు వెళ్లాలి?

**అక్రూరుడు:**
'ఇక్కడున్నట్టుగా రావాలి' అన్నది మహారాజుల ఆజ్ఞ!

**బలరాముడు:**
మమ్మల్ని చూడటానికి మా మామ తహతహ లాడి పోతున్నా డన్నమాట!

**కృష్ణయ్య:** ( బలరామునితో )
...మహారాజుల కోరికను మన్నించటం మన ధర్మం కదూ!

[ బలరాముడు చిలిపిగా మందహాసం చేశాడు. ]

**ఉపనందుడు:**
ఏమిటి...? చూస్తూ చూస్తూ పులినోట్లో తల దూర్చటమా?

**అక్రూరుడు:**
మనపిల్లలు మేకలైతే మన మలా భయపడాలి!

[ కృష్ణ బలరాములు మందహాసం చేశారు. నందాదులు యేదో ఆలోచిస్తూ తలపంకించారు. ]

**కృష్ణయ్య:** ఇహ ఆలోచించే దేముంది ?

( గోపకుల నుద్దేశించి )

"భూనాథుండు ముఖంబుజూడ బిలువం
బుత్తెంచి నాడ న్విభుం
గానంబోవలె బాలునెయ్యి పెరుగుల్
గట్నంబులుం గానికల్
మీ నేర్పొప్పగ గూడ బెట్టుడు తగన్
మీ మీ నివాసంబులన్
యానంబుల్ గొనిరండు పొండు మధురా
యాత్రాభి ముఖ్యంబుగన్"

( అక్రూరునితో )

...రేపే బయలు దేరుదాం!

[ అక్రూరుడు సరే అన్నట్టుగా తలవూపాడు. గోపకు లందరూ, 'వీరకిశోరసింహులకూ...జై', 'రాక్షససంహారులకూ ...జై' అన్న నినాదాలు చేస్తూ అక్కడినుంచి కదిలారు. ]

**ఉపనందుడు :**

ఉఁహుఁ...! ఇదెందు కొచ్చిందో!



## ★ 6. వ, ర ం గ ం ★

[ అప్పుడే తొలికోడి కూసింది. అయినా, బృందావనం అంతా, ఆదోవిధమైన కలకలంతో నిండిఉంది.

ఒక యింట్లో గోపిక లిద్దరు రహశ్యంగా మాట్లాడు కుంటున్నారు. ]

గోపిక: 1. ...విన్నావుటే...?

2. ఏమిటి...?

1. మన కృష్ణయ్య మధురకు వెడుతున్నాడు!

2. మధురకా...? ఇక మన గతి...?

1. ఆ పరమాత్మునికే తెలియాలి!

[ ఆ యిద్దరూ నిట్టూర్చారు. ]



## ★ 7. వ, రంగం ★

[ నలుగురు గోపికలు నందుని యింటివేపుగా వెడుతున్నారు. ]

గోపిక: 1. ఊఁ...! అసలు ఆ బ్రహ్మకు బుద్ధిలేదులే!

2. ఆయనకు తెలియక పోతే ఆ విడైనా చెప్పద్దూ?

3. ఎవరు...? సరస్వతమ్మా?

2. ఆఁ...ఆవిడే...!

4. ఊఁహుఁ! ఆవిణ్ణే చెప్పావ్! ఆవిడ ఆటా పాటా మాటా ఆవిడ కుంటే ప్రపంచం యేమైపోయినా సరే ఆవిడకు ఫరవాలేదు!

3. ఊఁహుఁ...అలాగే ఉంది; చూస్తే!



## ★ 8. వ, రంగం ★

[ మ రొకచోట యిద్దరు గోపికలు ముచ్చటించుకుం టున్నారు. ]

గోపిక: 1. ఉఁహుఁ...! అక్రూరుడని పేరేగాని ఆయన వట్టి క్రూరుడే!

2. ఆ...! ఆయన కంటె కటిక కసాయివాడు నయం!

1. మంచి మాటన్నావ్! కసాయి వాడికైనా కొంత దయా దాక్షిణ్యం అంటూ ఉంటుంది!

2. ఈయన మన పాలిటి యమదూతల్లే ఉన్నాడు!

3. అలా అయితే అనుకోవలసిం దేముంది? 'కృష్ణా!' అంటూ ఒక్కసారిగా ప్రాణం వదిలేవాళ్లం!

2. అదీ నిజమే. ఇప్పు డీయన...

1. మన ప్రాణా లిలా తీయటానికే మధురనించి వచ్చాడల్లే ఉంది!

[ కన్నీళ్లు తుడుచుకుంటూ ఆ గోపికలు అక్కడినుంచి కదలి వెళ్లారు. ]



# ★ 9. వ, రం గం ★

[ ఒక దేవాలయం దగ్గర కొందరు గోపికలు కూర్చుని యేదో ఆలోచిస్తున్నారు. ]

గోపిక 1. ...మధురలో పడ్డ మాధవుడు మళ్లీ మనకు కన బడతాడా అని...!

2. అందరి బాధా అదే!

3. బాధపడి మాత్రం చేసేదేముంది? జరిగేది యెలాగూ జరుగుతుంది!

1. పట్టణం చూసిన మీాదట పల్లెటూరి మాట మరచి పోయినా మరచి పోవచ్చు!

2. అంతేకాదు; పల్లె పడుచులు పలకరించినా, పలుకక పోవచ్చు కూడా!

2. ...పోనీ, ఆయన్ని తీసుకుపోవద్దని ఆ అక్రూరుణ్ణి బ్రతిమాలుకుంటే...?

3. ఆయన్ని బ్రతిమాలే కంటె ఆలయంలోఉన్న విగ్రహాన్ని బ్రతిమాలితే యిహమూ పరమూ రెండూ లభిస్తై!

4. అదంతా దేనికి...? ఆ మాధవుడితోనే మాట్లాడటం మంచిది కాదూ?

1. అదీకాదు యిదీకాదు. నాకు ఒకే ఒక మార్గం కనబడుతోంది!

[ గోపికలు 'ఏమిటది?' అన్నట్టుగా ఆమెవంక చూశారు.]

ఏమీా లేదు. అయన దారికి అడ్డుగా పడుకుందాం; యెలా వెడతాడో చూద్దాం! అంతే!!

[ వారలా మాట్లాడుతుంటూ ఉండగానే, దూరంనుంచి వేణునాదం వినిపించింది. ఆ వెంటనే, యెక్కడి వాళ్లు అక్కడినుంచి, అది వినిపించిన వేపుగా పరిగెత్తారు. ]



## ★ 10. వ్రంగం ★

[ గుణ్ణాల సకిలింపులూ, చిరుగంటల మ్రోతలూ దూరంనుంచి వినిపిస్తున్నై. మందలో జనమంతా ప్రయాణసన్నాహాల్లో ఉన్న హడావుడి అవుతోంది.

కృష్ణయ్య, వేణువు నూదుతూ, యెవరికోసమో యెదురు చూస్తున్నట్టుగా ఒకచోట నుంచున్నాడు. అంతలో నాలుగు వైపులనుంచీ, గోపికలు, గుంపులు గుంపులుగా అక్కడకు పరిగెత్తుకు వచ్చారు; ' కృష్ణా...! కృష్ణా...! " అని అరుస్తూ. ]

గోపిక: 1. ...కృష్ణా...! కృష్ణా...!! ఇదేం న్యాయం ?

[ కృష్ణయ్య మురళి నూదటం ఆపాడు. ]

2. ...మాధవా...! మమ్మల్ని యేం చేద్దా మనుకున్నావ్ ?

3. ...కృష్ణా...! మళ్లీ మాకు నీ దర్శనం యెప్పుడు ?

[ కృష్ణయ్య వాళ్లవంక సానుభూతితో చూశాడు. ]

4. ...మమ్మల్ని వదిలి వెడతావా ? మాకు దూరంగా ఉంటావా...? మే మేం పాపం చేశాం చెప్పు !

[ కృష్ణయ్య పకపకా నవ్వాడు. అంతలో బలరాముడూ అక్రూరుడూ అక్కడికి వచ్చారు. బలరాముడు గోపికలవంక సానుభూతితోనే చూశాడు; కాని,కృష్ణయ్యను ఉద్దేశించి ..]

బలరాముడు:

కృష్ణా...! ఇలా అయితే మనం యెప్పటికి వెడతాం ?

[ కృష్ణయ్య మందహాసం చేశాడు. ]

అక్రూరుడు:

...రథం సిద్ధమయింది !

కృష్ణయ్య: ఆఁ...వస్తున్నా !
( గోపికలతో )
...మీరు, నామాట వింటారా !
[ గోపికలు ఒకరి వంక ఒకరు చూసుకున్నారు. ]
...చెప్పండి...! ఊఁ...! నామాట వింటారా వినరా ?

గోపిక: 1. ( గోపిక 2. తో )
...చెప్పవే...చెప్పు !

2. ...ఏమని చెప్పేది ? వింటామంటే, 'ఇక్కడే ఉండి పొండి !' అంటాడు. అప్పుడేం చేస్తాం ?

3. 'వినం' అన్నా జరిగేది అంతే. 'నా మాట వినని వాళ్లతో నాకేంపని ?' అని చక్కాపోతాడు !

4. ఎటొచ్చినా యీాయనతో కష్టమే ; యేంచేస్తాం ?

1. పోనీ...సమాధానం చెప్పకుండా ఉంటే... ?

3. ఏముంది... ? మళ్లీ మాట్టాడకుండా మధురకు వెళ్లి పోతాడు !

4. ఉఁహుఁ ! ఇప్పుడు యేమన్నా తప్పే, యేంచేసినా తప్పే అని పిస్తోంది !

[ వాళ్ల అభిప్రాయాలు గ్రహించినట్టుగా కృష్ణయ్య చిరునవ్వు నవ్వాడు. బలరామునితో చేయికలిపి, ముందుకు అడుగువేశాడు ; గోపికల వంక చిలిపిగా చూశాడు.

అది చూసిన గోపికలు రాతి విగ్రహాలమాదిరి నుంచుని పోయినారు. మరుక్షణంలో, రథం కదలి వెడుతున్న ధ్వని అయింది. ]



## ★ 11. వ, రంగం ★

[ అది మధురకు వెళ్లేదారి. కాళిందీ నది ఆ ప్రక్కగానే ప్రవహిస్తోంది కృష్ణ బలరాములు ప్రయాణం చేస్తున్న రథం అక్కడ ఆగి ఉంది. దాని ప్రక్కగా అక్రూరుడు నుంచుని ఉన్నాడు.

కృష్ణ బలరాములు నదిలో స్నానం చేసి అప్పుడే ఆరథాన్ని సమీపించారు; అక్రూరుని వంక చూశారు. ]

కృష్ణయ్య: ...నువ్వు కూడా స్నానంచేసి వస్తావా!

[ 'ఆc...!' అంటూనే అక్రూరుడు అక్కడినుంచి కదిలాడు. ]

కృష్ణయ్య: ఇక్కడున్నట్టుగా రావాలి!

[ 'ఓ అలాగే' అన్నట్టు అక్రూరుడు తల ఆడించాడు; వెళ్లిపోయినాడు. ]

బలరాముడు:

ఇతని భక్తికి హద్దు అనేది కనపడటం లేదు!

కృష్ణయ్య: ఇతనిలో ఉన్న విశేషమే అది!

[ కృష్ణయ్య మందహాసం చేశాడు. ఏదో ఆలోచన తట్టినట్టుగా తల పంకించాడు. ]



## ★ 12. వ, రంగం ★

[ కాళిందీ నదిలో నుంచుని, అక్రూరుడు, అర్ఘ్యం వదులుతున్నాడు. అంతలో, అతనికి కొంతదూరంలో నది మధ్య, బలరామకృష్ణులు కనిపించారు. అతను ఆశ్చర్యచకితుడైనాడు.]

**అక్రూరుడు:**

రామా...!... కృష్ణా...!! ఏమిటీ విచిత్రం...?
ఇది భ్రమకాదు గదా !

( కొద్దిగా ఆలోచించి )

...ఇదేదో లీలగా ఉందే!...అయినా చూస్తాను ;
వాళ్లే తిరిగి వచ్చారో యేమో...!

[ అని అనుకుంటూనే అతను గబ గబా నది బయటకు వచ్చాడు. ]



# ★ 13. వ్రంగం ★

[ కృష్ణయ్య రథంలో కూర్చుని వేణువు నూదుతున్నాడు. బలరాముడు అది వింటూ ఆనందిస్తున్నాడు.
అంతలో అక్రూరుడు అక్కడకు పరిగెత్తుకుంటూ వచ్చాడు; వాళ్లను చూసి ఆశ్చర్య పోయినాడు. ]

**బలరాముడు:**

...ఏమిటిది...? అప్పుడే వచ్చావేం...?

**అక్రూరుడు :**

( తడబడే మాటలతో )

...అఁహాఁహాఁ...యేం లేదు! ...ఏమీ లేదు...!!

[ అంటూనే వాళ్లకు నమస్కరించాడు. అది చూసిన కృష్ణయ్య మందహాసం చేశాడు. ]

...ఇప్పుడే వస్తాను!

[ అంటూ, అక్రూరుడు తిరిగి వెళ్లాడు. కృష్ణయ్య చిరునవ్వు నవ్వుతూ బలరాముని వంక చూశాడు. ]



# ★ 14. వ, రంగం ★

[ అక్రూరుడు కాళింది వేపుగా వెడుతున్నాడు. ]

అక్రూరుడు:

...ఊఁహూఁ !...ఇది మాధవుడు చేసిన మాయ కాని, మరొకటి కాదు!

“ కంటిఁ మున్ను రథంబుపై జలములో
గంటిం దుదిం గ్రమ్మఱం
గంటిం దొంటి రథంబు మీఁద నిదె యీ
కళ్యాణ చారిత్రు లే
వెంటం దోఁచిరి రెండు దిక్కుల మనో
విభ్రాంతియో *లీలయో
వింటిఁ మున్నిటువంటి చిత్రముల హా
వీ రర్భకుల్ కారుపో* !”

... ఇప్పుడు అక్కడే ఉన్నారు గదా! ... తిరిగి యిక్కడ కనబడతారేమో చూస్తాను !

[ అని, చకచకా అడుగులు వేసుకుంటూ ముందుకు వెళ్లాడు. ]



# ★ 15. వ, రంగం ★

[ శేషశాయి అయిన శ్రీ మహావిష్ణువు కాళిందీనదిలో మహాద్భుతంగా కనబడుతున్నాడు. అక్కడకు చేరిన అక్రూరుడు, అదిచూసి, ఆశ్చర్యచకితు డైనాడు. అంతేకాదు; ఆ వెంటనే తన్మయత్వం పొందాడు కూడా. ]

**అక్రూరుడు:**

మోక్షప్రదాతా...!
"శ్రీమానినీ మానచోరా శుభాకార వీరా జగద్ధేతు
హేతు ప్రకారా సమస్తంబు నస్తంగతంబై మహా
లోల కల్లోల మాలాకులాభీల పాథోనిధిం
గూలగా బాలకేళీగతిం దేలి నారాయణాఖ్యం బటు
ఖ్యాతి శోభిల్లు నీ నాభికంజంబులో లోకపుంజం
బులం బన్నువిన్నాణిగై యున్న యా బమ్మ యుత్పన్ను
డయ్యెంగదా పావకాకాశ వాతావనీ వార్య
హంకార మాయా మహామానసాదుల్ హృషీ
కాదులున్ లోకముల్ లోక బీజంబులున్ నిత్య
సందోహమై నీ మహాదేహమం దుల్లసించున్
వసించున్ నశించున్ జడత్వంబులే కాత్మయై యొప్పు
నీ యొప్పిదం బెల్ల నో చెల్ల చెల్లన్ విచారింప దారెంత
వారెంత వారైన మాయాదు లా మాయతో గూడి
క్రీడించు లోకానుసంధాత యాధాత నిర్ణేతయే
నీ కళారాశికిం గొంద రంభోజగర్భాదు లధ్యాత్మ
లందున్ నశేషాది భూతంబులందున్ ననేకాది
దైవంబు లందున్ సదా సాక్షివై యుండు దంచున్
దదంతర్గత జ్యోతి వీశుండ వంచుం ద్రయీ
పద్ధతిం గొంద ఱింద్రాది దేవాభిధానంబులన్ నిక్క
దొక్కండ వంచున్ మఱింగొంద రారూఢ కర్మంబు
లం ద్రుంచి సంసారముం ద్రెంచి సన్న్యస్తులై మించి

విజ్ఞాన చక్షుండ వంచున్ మఱిం బాంచరాత్రాను
సారంబుగా ద్వన్వయత్వంబుతో గొంద ఱీ వాత్మ
వంచున్ మఱింగొంద ఱా వాసు దేవాది భేదం
బులన్ నల్వురై చెల్వు వాటింతు వంచున్ మఱిన్
నీవు నారాయణాఖ్యుండ వంచున్ శివాఖ్యుండ
వంచున్ మఱిం బెక్కు మార్గంబులన్ నిన్ను
నగ్గింతు రెగ్గేమి యేఱుల్ పయోరాశినే గాన్కలై
కూడు క్రీడన్ విశేషంబు లెల్లన్ విశేషంబు
లై డిండి నీయం దనూనంబు లీనంబు లౌనేక
రాకేందు బింబించు కుంభాంతరంభంబులం బింబితం బైన
వేఱున్న దే యెన్న నేలా ఘటాంతర్గతాకాశముల్
దద్ఘటాంతంబులం దేకమౌ రేఖ లోకావధిన్ వీక
నేపోకలం బోక యేకాకివై యుండు దీశా కృశా
నుండు నెమ్మోము భానుండు కన్నుల్ దిశల్ కర్ణ
ముల్ భూమి పాదంబు లంభోనిధుల్ కుక్షి
శల్యంబు లద్రుల్ లతాసాలముల్ రోమముల్
గాలి ప్రాణంబు బాహుల్ సురేంద్రుల్ ఘనంబుల్
కచంబుల్ నభోవీధి నాభిప్రదేశంబు రేలుం బగ
ళ్లున్ నిమేషంబు లంభోజ గర్భుండు గుహ్యంబు
వర్షంబు వీర్యంబు నాకంబు మూర్ధంబుగా నేకమై
యున్న నీమేని దండం బయోజాత గర్భాండముల్
మండితోదుంబరానోకహానేక శాఖాఫలాపూరితా
నంత జంతు ప్రకాండంబు లీలం బ్రసిద్ధోదరాశిస్థ
జంతు ప్రకాశంబుగా నిండి యుండున్ మహా
రూప నీ రూపముల్ వెగ్గలం బుగ్గడింపన్ లయాం
భోధిలో మీను మేనన్ విరోధిన్ నిరోధించి
సాధించి మున్ వేధకున్ వేదరాశిం బ్రసాదింప
వే త్రుంపవే కైటభ శ్రీ మధుం జక్రివై మొత్తవే
యెత్తవే మందరాగంబు రాగంబుతో కూర్మలీలా

పరిష్వంచివై పందివై మేదినిఁ మీఁదికిం ద్రోచి దోషాచరుం గోష్ఠులన్ నేష్ఠులం జిష్ణుచున్ గ్రువ్వవే త్రవ్వవే ఘోరవైరిన్ నృసింహుండవై దండివై దండివై రోచనిం జూచి యాచింపవే పెంపవే మేను బ్రహ్మాండము న్నిండ బాలుండవై రాజకోటిన్ నిపాటింపవే రాజవై రాజబింబాస్యకై దుర్మ దారిన్ విదారింపవే నొంపవే క్రూరులన్ వాసు దేవాదిరూపంబునఁ శుద్ధబుద్ధుండవై వైరి దారాంత రంగంబుల న్నంతరంగంబులుంగా గరంగింపవే పెంపు దీపింపవే కల్కిమూర్తిం బ్రవర్తించి నిన్నెన్న నే నెవ్వఁడఁ నన్ను మాయా విపన్నున్ విషణ్ణుం బ్రపన్నుం బ్రసన్నుండవై ఖిన్నతం బాపి మన్నింపవే పన్నగాధీశతల్పా కృపాకల్ప వందారు కల్పా నమస్తే నమస్తే నమః!"

తండ్రీ!

"కలలంబోలెడి పుత్రమిత్ర వనితా
గారాది సంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నా
సల్ సేయు చందంబునం
దలతున్ సత్యములంచు, మూఢుడ వృథా
తత్త్వజ్ఞుడన్ నాకు నీ
విలసత్పాదయుగంబు సూపి కరుణన్
వీక్షింపు లక్ష్మీపతీ!"

[ ప్రార్థన కాగానే అక్రూరుడు తిరిగి కళ్లు తెరచి నదిలోకి చూశాడు. శ్రీమన్నారాయణుడు అతనివంక సాదరభావంతో చూసి అభయం యిచ్చాడు; ఆ వెంటనే అదృశ్యుడైనాడు. ]

పరమేశ్వరా! లీలామానుష విగ్రహా! కృష్ణా...! కృష్ణా...!!

[ అంటూ అక్రూరుడు తిరిగి నమస్కరించాడు. ]



## ★ 16. వ, రంగం ★

[ రథంలో ఉన్న కృష్ణయ్య యింకా వేణువు నూదుతూనే ఉన్నాడు. అంతలో అక్రూరుడు అక్కడకు వచ్చాడు; అమాంతంగా, చేతులెత్తి అతని నమస్కరించాడు. ]

**బలరాముడు:**

అక్రూరా ? ఏమిటీ విచిత్ర ప్రవర్తన ?

**అక్రూరుడు:**

ఏముంది? నా తండ్రిని తలచుకుని నమస్కరిస్తున్నాను; అంతే !

**కృష్ణయ్య:** ( చిరునవ్వుతో )

అయినా...

" జలములు చేరువ నున్నవి
తలపోయగ నీవు పోయి తడవరయ్యే నదీ
జలముల నభమున ధరణిం
గలుగని చోద్యములు నీకు గానం బడెనే ?"

**అక్రూరుడు:**

మహానుభావా ! ... ఏమని చెప్పేది ?

" నీలోన లేని చోద్యము
లే లోకము లందు జెప్ప రీశ్వర నీటన్
నేలన్ నింగిని నున్నవె
నీలో జోద్యంబు లెల్ల నెగడు మహాత్మా !"

[ ఆమాట అంటూనే కృష్ణయ్యకు సాష్టాంగ పడ్డాడు. కృష్ణయ్య మందహాసం చేశాడు. ]



## ★ 17. వ, ర ం గ ం ★

[ అది మథురానగరంలో ఒక వీథి. అదంతా అలంకరింపబడి ఉంది. స్త్రీలూ పురుషులూ అక్కడ బారులు తీరి నుంచున్నారు. దూరంనుంచి మంగళ తూర్యనాదాలు వినబడుతున్నై ...]

పదుచు:1. (దూరంగా చూస్తూ రహస్యంగా.)
...అడుగడుగో...ఆయనే కృష్ణయ్య !

2. ...అరెరె...! ఆ అబ్బాయా...?

3. ఉఁహుఁ... !

"వీడటే రక్కసి విగతజీవిగ జన్ను
పాలు ద్రావిన మేటి బాలకుండు ?'

4. ఆహాహా ! ఎంత అందంగా ఉన్నాడు !

'వీడటే నందుని వెలదికి జగమెల్ల
ముఖమందు జూపిన ముద్దులాడు?'

5. అబ్బ !

'వీడటే మందలో వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కిన దాపరీడు ?'

6. చూడు ... చూడు ! ఆ మొహంలో లేతవనం యెంతగా నవనవలాడుతూ ఉందో !

7. ఆఁ ఆఁ... ! ఉఁహుఁ !

*వీడటే వీరాధివీరుల దునుమాడి
మంద నేలెడి లోక సుందరుండు*

8. నిజంగా...

'వీడు లేకున్న పుర మటవీ స్థలంబు,'

9. అంతే కాదు ;

'వీని బొగడని జన్మంబు విగతఫలము'

10.'వీని బలుకని వచనంబు విగతఫలము
వీని జూడని చూడ్కులు వృథలు వృథలు!!"

1. ఆయనే అనేమిటి? ఆయన అన్నగారు మాత్రం యేం తక్కువ తిన్నాడు? చూడు...యెలా ఉన్నాడో!

[ అంతలో కృష్ణయ్యా బలరాముడూ వారికి సమీపంగా వచ్చారు. అంతలో అనూంతగా, ఫలానా చోటినుంచి అని తెలియకుండా, వారిమీద పూల వాన కురిసింది. ఆ వెంటనే అక్కడి వాళ్లందరూ యెవరి హృదయాన్ని వారు కర్పూరంలా వెలిగించి వారికి హారతు లిచ్చారు. ]

ఒక కన్య: ఉఁహుఁ! ఈయన్ని కళ్లల్లో కట్టేసుకోవటానికి ఆ గోపికలు యేం పుణ్యం చేశారో యేమో!

[ అంటూ ఆమె నిట్టూర్చింది. అదే సమయంలో రాజుగారి చాకలి ఒకడు జనంలో నుంచి ముందుకు తోసుకు వచ్చాడు. చాకలి వీపుమీద ఓ పెద్దబట్టల మూట ఉంది; రామకృష్ణులు అది చూశారు. ]

కృష్ణయ్య: ఎవరోయ్ నువ్వు?

చాకలి: ఓయ్! 'నువ్వు' అంటుండావే! మాటలు సరిగ్గా రానియ్!

[ జనం పకపక లాడారు. ]

బలరాముడు:
కోప్పడకండి ... మడేలుగారూ! మా తమ్ముడికి మాటలు సరిగా రావు. ఇంతకూ...తమరు...

చాకలి: ...అలా అడుగు సెబుతా!

( మూట చూపుతూ )

ఇయిగో...సూశావా? ఏంటియి? సాపులు. పట్టు సాపులు! మా మారాజు సుట్టుకు పారేసే పయిడి పంచలూ అయ్యాని!

[ జనం లోలోపల నవ్వుకున్నారు. బలరాముడు మాత్రం విరగబడి నవ్వాడు. ]

ఊఁహూఁ! ఎట్టి గొల్లోళ్లు యికిలించక సకిలించక యేం సేత్తారూ అంట!

కృష్ణయ్య: ఏం అనుకోవద్దు బాబూ! మా అన్నయ్యకు మర్యాద అంటేనే తెలియదు?

చాకలి: అద్గదీ యిసయం. ఉట్టి యెట్టోడు. అంతేనా?

కృష్ణయ్య: అంతే...అంతే!!...చూడు...!

"విందులమై నరేశ్వరుని
వీటికి వచ్చితి మేము మాకు మా
మందలలోన గట్టికొన
మంచి పటంబులు లేవు నీ ముడిక్
సుందర ధౌతచేలములు
శోభిలుచున్నవి తెమ్ము నిన్ను మే
లందెదు నిమ్ము రాజు దెస
నల్లుర మో రజకాన్వయాగ్రణీ"

చాకలి: ఆఁఆఁ...! మా రాజు సుట్టుకునేయి మీ కియ్యాల్లా? మీ రయి సుట్టుకుంటారా? ఊఁహూఁ! కొవ్వి కూత్తుండారే!...గొల్లగూడాల్లో తిరిగి, యెన్నా నెయ్యో మెక్కి ఒల్లూపై తెలవకండా ఉండారన్న మాట! ...ఈ యిసయం మా మారాజుకు తెలిత్తే యేం సేత్తాడో యెరికేనా? తోలొలిపించేత్తాడు; యేమను కుండారో!

[ ఆ మాటలు విన్న జనం చాలా నొచ్చుకున్నారు. అతణ్ణి వారించాలని అనుకున్నారు; కాని, ఆగారు.
అంతలో, కృష్ణయ్య, అతణ్ణి చాచి చెంపకాయ కొట్టాడు. దాంతో, వాడు, 'కుయ్యో ... మొర్రో!' అంటూ నేల మీద పడి గిలగిలా తన్నుకున్నాడు. ]

పురుషుడు: 1.

అయ్యయ్యో...యెంతపనయింది? ఇది తెలిస్తే మహా
రాజు ఊరుకుంటాడా?

2. ఉహుఁ...! ఉట్టి దుడుకు పిండాలు! బ్రతికి
బయట పడేటట్టు లేరు!

3. అయినా, వాడలా అనటం బాగుందా?

4. ఇంతకూ, మన కెందు కొచ్చింది?

[ అలా అనుకుంటూనే అందరూ అక్కడినుంచి వెళ్లిపోయి
నారు. బలరామ కృష్ణులు ఆ చాకలి మూటలోనుంచి
కావలసిన బట్టలు తీసుకుని నిర్భయంగా అక్కడినుంచి
కదిలారు. ]



## ★ 18 వ, రంగం ★

[ అది మధురానగరంలో మరొక వీధి. అక్కడ కూడా జనం క్రిక్కిరిసి ఉన్నారు. అక్రూరునితో సహా బలరామ కృష్ణులుఅటు వచ్చారు.

బలరామ కృష్ణులు రాగానే ఒక వాయకుడు బంగారు పళ్లెంలో పట్టు పీతాంబరాలూ అమూల్యమైన ఆభరణాలూ పెట్టుకుని వారికి యెదురు వెళ్లాడు; వాటిని వారికి సమర్పించు కున్నాడు. ]

వాయకుడు:

కృష్ణా...! కృష్ణా...!! నీదర్శనం వల్ల నా బ్రదుకు పవిత్రమైంది తండ్రీ! నా జన్మతరించింది నాయనా! కృష్ణా...! ...కృష్ణా...!!

కృష్ణయ్య: ( వాయకుని కౌగిలించుకుని )

...వాయకా! నీ ప్రేమ నన్ను పరవశుణ్ణి చేస్తోంది. నీ కున్న కోరిక యేమిటో చెప్పు!

వాయకుడు:

నాయనా...! నీ దర్శనంకోసమే యిన్నాళ్లూ తపించాను. అది యీ రోజున లభించనే లభించింది. ఇక నాకు కావలసిందేముంది? ఏం లేదు బాబూ... ఏమీ లేదు!!

కృష్ణయ్య: ( మందహాసం చేస్తూ )

...వాయకా...! నువ్వు కోరకపోయినా నీకు రెండు వరా లిస్తున్నాను. ఇక నువ్వు సిరిసంపదలతో తుల తూగుతూ జీవితాన్ని వెళ్ల దీసుకో! ఆ పైన నన్ను చేరుకో! సరేనా... ?

వాయకుడు:

నీ యిష్టం అలా ఉంటే కాదనటానికి నే నెవరిని నాయనా! కాకపోతే, ఆ రెండో వరం యెంత త్వరగా ప్రాప్తమైతే అంత సంతోషిస్తాను; అంతే!

[ అంటూ వాయకుడు వారి పాదాలమీద వ్రాలాడు. బల రామ కృష్ణులు అతణ్ణి ఆనందంతో లేవదీశారు. ]



## ★ 19. వ, రంగం ★

[ అది మాలాకారుడు సుదాముని యిల్లు. బలరామకృష్ణులు అక్కడికి వచ్చారు. వారి రాక తెలుసుకుని సుదాముడు బయటకు వచ్చాడు. వచ్చి, వారి పాదాలకు పెనవేసు కున్నాడు. వారు ఆతణ్ణి అమితమైన అభిమానంతో లేవ నెత్తారు. ]

కృష్ణయ్య: ...సుదామా...! క్షేమంగా ఉన్నావా?

సుదాముడు :

ప్రభూ...! ఏ పని చేసినా నీకోసమే అనుకుంటూ, యెవరిని సేవించినా నిన్నే అనుకుంటూ బ్రతికే వాళ్లకు క్షేమంకాక మరొకటి యెలా కలుగుతుంది?

[ కృష్ణయ్య మందహాసం చేశాడు. ]

...అయినా ప్రభూ...ఇదేం పని చెప్పండి! మీా రేమిటి...నా యింటికి రావట మేమిటి? ఎవరన్నా చూాస్తే యేమను కుంటారు?

కృష్ణయ్య: ...సుదామా! ఏమిటీ భ్రమ...? భక్తులను కలుసు కోవటానికి కూడా భయపడాలా?

సుదాముడు :

తండ్రీ! నీపలుకులు నాకు అమృతపు చినుకులుగా ఉన్నై. ఇంతకూ...

" పావన మయ్యె నా కులము
పండె దపంబు గృహంబు లక్ష్మికిక్
సేవితమయ్యె నిష్టములు
నేకురె విశ్వనిదాన మూర్తులై

భూవలయంబు గావ నిటు
పుట్టిన మీరలు రాకజేసి నే
నే విధ మాచరింతు బను
లెయ్యవి బంట నెరుంగ జెప్పరే!"

[ అత డలా ప్రార్థిస్తూ ఉండగానే, అతని స్నేహితు డొకడు ఒకపళ్లెం నిండా పూలమాలలు పెట్టుకుని అక్కడికి వచ్చాడు. సుదాము డవి అందుకుని రామ కృష్ణుల మెళ్లల్లో వేశాడు. ]

[ కృష్ణబలరాములు అమితమైన అభిమానంతో అతని వంక చూశారు. ]

...ఆహాహా...! ఎంత చక్కగా ఉన్నారు నాయనా! మిమ్మల్ని అలంకరించే అదృష్టం యీనాటికైనా కలిగింది; అంతేచాలు!

కృష్ణయ్య: ...సుదామా! నీ ఆతిథ్యాన్నైతే స్వీకరించాను; కాని, నీకు నేను చేయగలది యేముందో తోచకుండా ఉంది!

సుదాముడు:

అదేమిటి నాయనా? నేను, ప్రతిఫలంకోరి నీకు ఆతిథ్యమిస్తున్నానా? ... లేదే!

కృష్ణయ్య: అఁహాఁహాఁ...అదికాదు! నీకు యేదో ఒక మేలు చేయాలని నాకే అనిపిస్తోంది. అంతే!

సుదాముడు :

అలా అయితే నా జీవితం ధన్యమయిందన్నమాటే! ...అయితే, చెప్పు నాయనా...యే వరం యివ్వాలని ఉంది?

కృష్ణయ్య: ( చిరునవ్వుతో )

నువ్వు యేది కావాలని కోరితే అదే!

**సుదాముడు:**

( సంతోషంతో )

...అయితే...కోరుకోమంటావా !

కృష్ణయ్య: ఊఁ...సందేహం దేనికి ? ఏం కావాలో చెప్పు !

**సుదాముడు:**

...ఏముంది...?

" నీపాద కమల సేవయు
నీ పాదార్చకులతోడ నెయ్యమ్మును నితాం
తాపార భూత దయయును
దాపసందామర నాకు దయసేయగదే !"

[ కృష్ణబలరాములు అమితమైన అభిమానంతో అతని వంక చూశారు. ]

కృష్ణయ్య: ...సుదామా...! అవి నీకు యేనాడో లభించినై. కాకపోతే, యికముందు అవి, నీ కోరిక ప్రకారం, నిశ్చలంగా నీలో నిలిచిపోతై. సరేనా ?

**సుదాముడు :**

మహా ప్రసాదం !

[ అంటూనే సుదాముడు కృష్ణయ్య పాదాలమీద వ్రాలాడు. కృష్ణయ్య అతణ్ణి లేవదీసి అమితమైన అభిమానంతో ఆలింగనం చేసుకున్నాడు.

బలరాముడు కృష్ణ సుదాములను చూస్తూ అలాగే నుంచునిపోయినాడు. ]



## ★ 20. వ రంగం ★

[ మధురలో ఆదొక రాచబాట. కుబ్జ అనే కంసుని పరిచారిక ఒక బంగారపు గిన్నెలో సుగంధ లేపనాన్ని పోసుకుని కంసుని మందిరానికి వెడుతోంది.

శ్రీ కృష్ణబలరాములు తమ విడిదికి వెడుతూ ఆ వీథిలో ప్రవేశించారు.

కృష్ణయ్యను చూసి కుబ్జ నిర్ఘాంతపోయింది. అతని వంకయెగా దిగా చూస్తూ నిలబడి పోయింది.

బలరామ కృష్ణులకు దాని చేష్టలు ఆశ్చర్యాన్ని కలిగించినై. ]

కృష్ణయ్య: ...చూడు !...నువ్వు...

" ఎవ్వరిదానవు లేపము
లెవ్వరికిం గోరి కొనుచు నేగెదు నీవే
రెవ్వతె మాకిమ్మన్నియు
నివ్వటిలెదు చక్కనగుచు నీరజ నేత్రా !"

కుబ్జ: ( మనసు చిన్నబుచ్చుకుని )

ఉఁహుఁ—! నల్లనయ్యా...!

" చక్కనివాడవౌదు సర
సంబుల నొంపకు మెల్లవారికిం
జక్కదనంబు లెక్కడివి
చారు శరీర త్రివక్రయండ్రు నే
నిక్కము కంసు దాసిని వి
నిర్మల లేపన విద్యదాన నః
మిక్కిలి రాజు మెచ్చు దగ
మీరు విలేపనముల్ ధరింపరే !"

కృష్ణయ్య: సెబాస్ ! మనిషికి వంకరలున్నా మాట మాత్రం సూటిగానే ఉంది. ఏదీ ఆ గంధం...!

[ కుబ్జ సంతోషంతో ముందుకు వచ్చింది. ఆ గంధాన్ని నల్లనయ్యకు పూయసాగింది. కృష్ణయ్య కూడా సంతోషంతో దాని సేవను స్వీకరించాడు. అది చూసిన బలరాముడు ముసి ముసి నవ్వులు నవ్వుకున్నాడు. ]

అయిందా !

కుబ్జ: అప్పుడేనా ? ఇంకా ఆవగింజలో అరవయ్యోవంతు కాలేదు !

[ కృష్ణ బలరాములు విరగబడి నవ్వుకున్నారు. ]

మహారాజైతే యీపాటికి మానెడు వరహాలిచ్చేవాడు!

[ కృష్ణయ్య బలరామునివంక ఓరగా చూశాడు. ]

కృష్ణయ్య: ( చిలిపిగా )

ఇన్ని వంకరలున్నప్పుడే అన్ని వరహాలిస్తే యే వంకరా లేకపోతే యెన్ని వరహాలిస్తాడో ?

కుబ్జ: ( విచారంతో )

...ఎన్నైనా యిస్తాడు; ఆయనకేం...మహరాజు! కాని నాకా అదృష్టముంటేగా !

కృష్ణయ్య: ( చిరునవ్వుతో )

లేదని యెందుకనుకోవాలి ? కావాలంటే, ఆ అదృష్టాన్ని నే నిస్తాను ; వరహాలుమాత్రం నువ్వు ఆయన దగ్గరే తీసుకోవాలి ; ఏమిటి...నీ కిష్టమేనా !

కుబ్జ: ( కృష్ణుని ముఖంలోకి చూస్తూ )

...ఊహుఁ ! నల్లనయ్య మాటలు నమ్మవచ్చా అని !

కృష్ణయ్య: నమ్మిన వాళ్లెవరూ యింతవరకు చెడిపోలేదు !

[ అది విన్న బలరాముడు మందహాసం చేశాడు. ]

కుబ్జ: నిజంగానా...? ఊఁ...? ఐతే సరే...! నేనుకూడా నిన్ను పూర్తిగా నమ్ముకుంటాను; ఏంచేస్తావో చెయ్?...నాయనా!

కృష్ణయ్య: ( చిలిపిగా నవ్వుతూ )
ఊఁ...!యేదీ...అలానుంచో...! ఊఁ... అంతే అంతే...అల్లాగే...!!

[ అంటూనే కృష్ణయ్య దాని పాదంమీద తన పాదం నొక్కి ఉంచి దాని గవుద కింద తన రెండు బొటన వ్రేళ్లనూ పెట్టి పైకి యెత్తాడు. క్రమ క్రమంగా అది సరిగా నుంచోవటం మొదలు పెట్టింది. మరి కొంత సేపటికి దాని వంకర లన్నీ పోయినై.

మరుక్షణంలో త్రివక్ర అయిన కుబ్జ ఒక అందాల బరిణె మాదిరి తయారయింది. ఆ విధంగా రూపం మారగానే, అది, కృష్ణయ్యముందు నుంచుని ఆయన కళ్లల్లో తన అందాన్ని చూసుకుంది ; అమితంగా మురిసి పోయింది; ఆ వెంటనే ఒళ్లు తెలియని ఆనందంతో "కృష్ణా! కృష్ణా!" అంటూ ఆయన చేతుల్లోకి ఒరిగి పోయింది.

బలరాము డది చూసి ఆశ్చర్యపడ్డాడు.

కృష్ణయ్య మాత్రం దానివంక అదో విధంగా, చిలిపిగా చూడసాగాడు. ]



## ★ 21. వ, రంగం ★

[ అది కంస మహారాజు ధనుశ్శాల. అందులో ఒక పెద్ద విల్లు ఉంది. కృష్ణ బలరాములు దాని ముందు నుంచున్నారు. ]

కృష్ణయ్య: అబ్బ ! దీని ముందు నుంచుంటే మానవు లెంత అల్పులో అర్థమౌతోంది !

కావలివాడు :

అందుకనే మనుష్యు లెవ్వరూ దీని దరిదాపుల్లోకికూడా రారు. మా మహారాజు కోసమే యిదిక్కడుంది !

బలరాముడు :

...ఓహో ! అయితే మీా మహారాజు మనిషి కాడన్న మాట !

[ అక్కడ ఉన్న గోపబాలురు ఆ మాట విని విరగబడి నవ్వారు. కాపలావాడు కొంచెం కష్ట పెట్టుకున్నాడు. ]

కృష్ణయ్య: ఇంతకూ దీన్ని యెవరూ యెత్తలేరంటావు !

కాపలావాడు :

ఎత్తటం వరకూనా... ? వింటిత్రాడు తొడిగి వీరుడుకూడా యింతవరకు కనపడలేదు.

కృష్ణయ్య: అబ్బా ! ఇది అంత అద్భుతమైన దన్నమాట ! ...ఏదీ చూద్దాం ఉండు !

[ అంటూనే ఆ వింటి దగ్గరకు వెళ్లాడు. అక్కడ ఉన్న వాళ్లందరూ అతడు యేం చేస్తాడో అన్న భయంతో వణికి పోయినారు. అందులో కొందరు 'వద్దు వద్దు. ఆ పని చెయ్యద్దు !' అని కృష్ణయ్యను వారించటానికి ప్రయత్నించారు.

కృష్ణయ్య వాళ్ళమాటలు వింటూనే, ఆ వింటిని యెడం చేత్తో సునాయాసంగా యెత్తేశాడు. మరుక్షణంలో వింటి త్రాటిని బిగించాడు. అది చూసిన వాళ్ళందరూ ఆశ్చర్య పోయినారు.

ఆ వెంటనే, కృష్ణయ్య, వింటి త్రాటిని యిట్టె లాగి వది లాడు. అది పెద్ద ఉరుము మాదిరి మ్రోగింది. ఆ మ్రోతకు అక్కడ ఉన్న వాళ్లు అదలిపోయినారు. అది చూసిన కృష్ణ బలరాములు విరగబడి నవ్వారు. అలా నవ్వుతూనే, కృష్ణయ్య ఆ విల్లును చేతిక్రింద మోపుగా పెట్టుకున్నాడు. దాంతో, అది అమాంతంగా వంగిపోయింది; వంగిపోవటమే కాదు; వేయి పిడుగుల ధ్వని చేస్తూ విరిగి పోయింది కూడా.

అది చూసిన కావలివాళ్లకు యెక్కడలేని ఆవేశం కలిగింది. వింటినలా విరవటం ప్రభువును పరాభవించటమే అనుకున్నారు. అందుకనే, తమ తమ ఆయుధాలతో కృష్ణ బలరాముల మీదికి ఉరికారు. అది చూసిన కృష్ణయ్యకు కోపం వచ్చింది. బల రాముడు కూడా పళ్లు పట పట లాడించాడు. ఆ వెంటనే ఆ యిద్దరూ అక్కడ పడి ఉన్న వింటి ముక్కలు తీసుకుని వాళ్ళమీద తిరగబడ్డారు; దెబ్బ కొక మనిషిని కూల్చేశారు.

అప్పుడు ఆ ధనుశ్శాల అంతా ఒక చిన్న రణరంగంగా మారిపోయింది. అక్కడ ఉన్న జనమంతా హాహాకారాలు చేస్తూ బయటికి పరిగెత్తారు. అది చూసిన బలరామ కృష్ణులు వికటాట్టహాసం చేశారు. ]



# ★ 22. వ, రంగం ★

[ అది కంస మహారాజు యేర్పాటు చేసిన మల్ల రంగ స్థలం. అందులో ఒక ప్రక్కగా కంసుడూ అతని మంత్రులూ మిత్రులూ సామంతులూ ఉచితాసనాలమీద కూర్చున్నారు. కంసుని ప్రక్కనే అతని సోదరులు వ్యగ్రోధుడూ, గహ్వ్యడూ మొదలైన వాళ్లున్నారు.

కంసుని ముఖాన అమితమైన ఆందోళన కనబడుతోంది. ఆతని అనుచరులందరూ యేదో దీర్ఘంగా ఆలోచిస్తున్నారు.

మల్ల రంగస్థలమంతా మంగళ వాద్యాలతో మార్మోగి పోతోంది.

అంతలో నందాదులు ప్రవేశించారు. వారికి అక్రూరుడు దారి చూపించాడు.

నందాదులు సరాసరి కంసుని సమీపించారు.

కంసుడు, లేని వికాసం తెచ్చుకుని, వాళ్లను చూపులతోనే పలుకరించాడు ; వాళ్లకు స్వాగతం చెప్పాడు.

నందుడు, తను తెచ్చిన కానిక లన్నింటినీ కంసుని ముందు ఉంచాడు ; కంసునకు నమస్కరించాడు. కంసుడు వాటి వంక ఒకసారి చూసి, మూగ సైగతోనే నందునకు ఆసనం చూపించాడు.

అంతలోనే 'మల్లదుందుభి' మోగింది. అక్కడ చేరిన ఆబాలగోపాలం యేక కంఠంతో 'కంసమహారాజేంద్రునకూ... జై' 'అసురాధిపతికీ జై' అన్న నినాదాలు చేశారు. కంసుడు సగర్వంగా మీసం మెలివేసుకున్నాడు. ]



## ★ 23. వ, రంగం ★

[ బలరామ కృష్ణులు తమ విడిదినుంచి బయలుదేరి మల్లరంగ స్థలం వేపు వస్తున్నారు. వారి వెనుక గోపాలురున్నారు. వారందరూ ఆ దుందుభి మోగిత విన్నారు. ]

**బలరాముడు :**

...మల్లులకు అది ఆహ్వానం కాబోలు!

కృష్ణయ్య: ( మందహాసంతో )

మల్లు లందరికీ కాదు ; మనకే! మనకోసమేగా, మామయ్య, యిదంతా యేర్పాటు చేసింది!

[ కృష్ణ బలరాములు మందహాసం చేశారు. గోపబాలురు ముసి ముసి నవ్వులు నవ్వుతున్నారు. ]



## ★ 24. వ, రంగం ★

[ కంసుని మందిరం ముందు, జనం, బారులు తీరి నుంచున్నారు. సింహద్వారం వద్ద పట్టపు టేనుగు, ఒళ్లూపై తెలియని స్థితిలో ఉంది ; మాటి మాటికీ ఘీంకారం చేస్తోంది.

బలరామ కృష్ణులు గోపబాలురతో సహా అక్కడికి వచ్చారు. రాగానే కాటుక కొండమాదిరి ఉన్న యేనుగును చూశారు. చూసి, ఒక క్షణం సేపు అలాగే నుంచుని పోయినారు.

రామకృష్ణులు తన ముందుకు రాగానే, మావటి వాడు, గౌరవం చూపటానికి బదులు మీసం మెలివేసుకున్నాడు. ఆ వెంటనే ఆ మదపు టేనుగను అంకుశంతో పొడిచాడు.

ఏనుగు అమితమైన బాధతో, ఘీంకారం చేసింది. అటూ యిటూ ఊగుతూ కొంచెం ముందుకు వెళ్లింది.

మావటివాడు, వెంటనే, దాన్ని రామ కృష్ణుల మీదికి ఉసి కొలిపాడు. అది గ్రహించిన బలరాముడు కృష్ణయ్య వంక ఓరగా చూశాడు; ఏదో సైగ చేశాడు. ]

కృష్ణయ్య: " ఓరీ కుంజరపాల మాదెసకు నీ
యుద్వృత్తమదేభేంద్రముం
ప్రేరేపం బనిలేదు త్రిప్పు మరలం
ప్రేరేచినన్ నిన్నుగం
భీరోగ్రాశని తుల్య ముష్టిహతులన్
భేదించి నే దంతకుం
జేరంబుత్తు మహాత్తర ద్విపముతో
సిద్ధంబు యుద్ధంబునన్"

[ ఆ మాట అంటూనే, కృష్ణయ్య పోరాటానికి సిద్ధమైనాడు; ఆ యేనుగుకు యెదురు వెళ్లాడు.

అది చూసిన అతని స్నేహితులూ, అభిమానులూ, అమితంగా ఆందోళన పడ్డారు. "కృష్ణా ... కృష్ణా ..!! జాగ్రత ... జాగ్రత !!" అని ఆయనకు హెచ్చరిక చేశారు.

అదే సమయమనుకుని, మావటివాడు, ఆ యేనుగును కృష్ణయ్య వేపుగా పోనిచ్చాడు. అది కూడా, భీకరంగా ఘీంకరిస్తూ తొండం యెత్తి కృష్ణయ్య మీదకు వెళ్ళింది.

కృష్ణయ్య, అటు తిరిగి యిటు తిరిగి, ఒడుపుగా ఆ యేనుగు తొండం పట్టుకున్నాడు. ఆ వెంటనే ఆ తొండంతో దాని ముందరి కాళ్లకు బంధం వేశాడు; ఓ ప్రక్కకు లాగాడు.

దాంతో, అంత పెద్ద యేనుగూ అమాంతంగా కూలి పోయింది. అది చూసిన ప్రజలు అతని చాకచక్యాన్ని అభి నందించారు; శక్తి సామర్థ్యాలను ప్రశంసించారు; జయ జయ ధ్వానాలు చేశారు.

ఆ తరువాత, కృష్ణయ్య, దాని పొట్టమీద కాలువేసి నొక్కి పట్టి, దాని దంతాన్ని ఊడబెరికాడు. అది బాధతో గిలగిలా తన్నుకుంది. ఘీంకారం చేసింది. తల ఓ ప్రక్కకు వాల్చేసింది.

అది చూసిన రాజ భటులు కృష్ణయ్యమీద తిరగబడ్డారు. కృష్ణయ్య, ఆ ప్రక్కనే పడి ఉన్న యేనుగు దంతాన్ని చేతు లోకి తీసుకుని, వాళ్ళ నెదిరించాడు. మరు క్షణంలో వాళ్లం దరినీ యమలోకానికి పంపేశాడు.

అది చూసిన మథురా నగరవాసులు అమితమైన ఉత్సా హంతో కృష్ణయ్యకు జేజేలు చెప్పారు. కృష్ణయ్య వారంద రినీ చిరునవ్వుతో పలుకరించాడు. ]

**పడుచు:** 1. ఉహుఁ...! బాలుడైతే మాత్రం యేం...
బ్రహ్మాండమైన పని చేశాడు!

2. ...ఇంతకుముందు, యింతకు మించిన ఘనకార్యా
లెన్నో చేశాడు ; యిదో లెక్క ?

" చంపె రక్కసిబట్టి చక్రవాకుని గూల్చె
బడ *ద్రోసె* ముద్దుల బకుని జీరె
నఘదైత్యు బారిగొనె నడరి వత్సకు ద్రుంచె
గిరియెత్తి దేవేంద్రు గ్రిందు పఱిచె
గాలియి మర్దించె గహనానలము ద్రావె
గేశి నంతకుపురి క్రేవ కనిచె
మయు పుత్రు బరిమార్చె మరియును దానవ
భటుల హరించి గోపకుల గాచె
గోపకాంతల మనముల కోర్కె తీర్చె
నీ సరోరుహ లోచనుం డీ శుభాంగు
డీ మహామహు డీ దిగ్గజేంద్రనిభుడు
మనుజ మాత్రుడె తలపోయ మాధవుండు "

[ వారలా అనుకుంటూ ఉండగానే, బలరామ కృష్ణులు తమ స్నేహితులతో సహ, విజయోత్సాహంతో ముందుకు సాగి వెళ్లారు. ]



## ★ 25. ప్రరంగం ★

[ మల్లయుద్ధరంగం చుట్టూ, జనం కిటకిటలాడిపోతున్నారు. ఓ ప్రక్క కంస రాజేంద్రుడూ అతని సహచరులూ ఉన్నారు. వారి ప్రక్కనే నందాది గోపకు లున్నారు. పౌరులు రంగస్థలం చుట్టూ కూర్చున్నారు. ]

[ చాణూరుడూ ముష్టికుడూ, అప్పుడే రంగంలో ప్రవేశించారు: వారు కనపడగానే ప్రజలలో, అదో విధమైన ఉత్సాహోద్రేకాలు కలిగినై. కొందరు కరతాళ ధ్వనులు చేశారు. మరి కొందరు వారి మీదికి పూలమాలలు విసిరారు. ఇంకా కొందరు జేజేలు చెప్పారు. మొత్తంమీద అక్కడ చేరిన జనసమూహం ఆ యోధులకు ఘనమైన స్వాగతాన్నే సమర్పించింది.

అంతలో బలరామకృష్ణులు ప్రవేశించారు. వారిని చూడగానే ఆ ప్రదేశమంతా నిశ్శబ్దమైపోయింది. అందరిచూపులూ వారిమీదనే కేంద్రీకృతమైనై. అది గ్రహించుతున్న కంసుని ముఖం అదోవిధంగా మారిపోయింది. అది గమనించిన నందుని హృదయంలో యేదో సంకోచం ప్రవేశించింది.

బలరామ కృష్ణులు, చిరునవ్వులు చిందుకుంటూ, సరాసరి కంసుని సింహాసనం వేపుగా వెడుతున్నారు. చాణూరుడూ ముష్టికుడూ అది చూశారు. చూసి, వాళ్లను ఉద్దేశించి, తమ వేపుగా రమ్మన్నట్టు సైగచేశారు. అది గ్రహించిన బలరామకృష్ణులు అక్కడే ఆగిపోయినారు. ]

**చాణూరుడు:**

...నల్లనయ్యా...యిటు యిటు... !

[ ఆ పిలుపువిన్న నందుని గుండెలో యేదో కలుక్కుమంది. ఉద్రేకంతో అతను లేవబోయినాడు. కాని, అతని

ప్రక్కనే ఉన్న అక్రూరుడు, అతని భుజంమీద చేయివేసి, ఉద్రేకాన్ని ఉపశమింపచేశాడు.

మల్లుల ఆహ్వానంలో ఉన్న అంతరార్థాన్ని కృష్ణయ్య గ్రహించాడు. అందుకనే, 'అసలు విషయం అర్థమయిందా!' అన్నట్టు, బలరాముని వంక ఓరగా చూశాడు. ]

...చూడు...!

"వన మార్గంబున గోప బాలకులతో
వత్సంబులన్ మేపుచున్
బెనగన్ మిక్కిలి నేర్చినా రనుచు నీ
పృథ్వీజనుల్ సెప్ప మా
మనుజేంద్రుం డిట మిమ్ము జీరబనిచెన్
మల్లాహవ క్రీడకుం
జనదే కొంత పరాక్రమింప మనకున్
సభ్యుల్ విలోకింపగన్ "

[ అది విన్న కృష్ణయ్య, చిరునవ్వు నవ్వుతూ ఆ వీరుల వంక చూశాడు.

బలరాముడు నందాదులవేపు తిరిగి 'మాకు వచ్చిన భయమేమీ లేదు, మీరు శాంతంగా ఉండండి!' అన్నట్టుగా, మందహాసం చేశాడు. ప్రేక్షకులలో మాత్రం, అదోవిధమైన కలకలం బయలుదేరింది. ]

కృష్ణయ్య: ...దానికేం...? అలాగే చేద్దాం!

చాణూరుడు :

( వికటంగానవ్వి )

...మేం పిలిచింది గొల్లల యిళ్లల్లో దూరటానికి కాదు; మల్లులతో యుద్ధం చేయటానికి! అర్థమయిందా?

[ అది విని, కొందరు ప్రేక్షకులు విరగబడి నవ్వారు. కృష్ణయ్య, మనసు చిన్నబుచ్చుకుని, బలరాముని వంక చూశాడు. ]

**బలరాముడు:**

...ఇంత మాత్రానికే యిదైపోతేయెలా? వాళ్లు మల్లులు. మనుష్యులు యెంత నిండుగా ఉంటారో మనసులు అంత బండబారి ఉంటాయి. అది మనం తెలుసుకోవాలి.

[ అదివిన్న గోపకులు ముసిముసినవ్వులు నవ్వుకున్నారు. కంసుని ముఖం చిటపటలాడి పోయింది. ]

**చాణూరుడు:**

...ఇంతకూ నువ్వనేది...

**బలరాముడు:**

ఏమీ లేదు; వినిపించే మాటలన్నీ పాటించాల్సిన పనిలేదని మావాడికి చెబుతున్నాను; అంతే!

**ముష్టికుడు:** ...ఐతే, మీరు పాటించేవి కొన్నీ పాటించనివి కొన్నీ ఉన్నైఅన్నమాట!

**బలరాముడు:**

ఎందుకుండవ్? ఇప్పుడు మీరు మల్లయుద్ధానికి మమ్మల్ని ఆహ్వానించారు. ఆ మాట పాటించటం, ఆ ఆహ్వానాన్ని అందుకోవటం మాధర్మం!

**చాణూరుడు:**

ఓ...! అలా అయితే, యుద్ధానికి సిద్ధంగానే ఉన్నారన్న మాట!

**బలరాముడు:**

...ఇంకా సందేహమా?

**కృష్ణయ్య:** కాకపోతే...

"సాములు లేవు పిన్నలము
సత్వము కల్గన రాదు మల్లసం
గ్రామ విశారదుల్ కులిశ
కర్కశదేహులు మీరు మీకడ

స్నేము చరించు టెట్లు ధర
ణీ పతివేడ్కలు సేయువారముం
గాము వినోదముల్ సలుప
గాదన వచ్చునె యొక్క మాటికిన్"

చాణూరుడు:
ఓయ్...! చాలా ఒడుపుగా చెప్పావే!

బలరాముడు:
మావాడి పోట్లు యెంత ఒడుపుగా ఉంటయో మాటలు కూడా అంతే!

[ ఉపనందుడూ నందుడూ ఒకరివంక ఒకరు చూసుకున్నారు; మందహాసం చేశారు. ]

చాణూరుడు:
ఇంతకూ, మీవాడు మొనగాడే నంటావ్!

బలరాముడు:
కాదని మీరు ఋజువుచేసే వరకూ అంతే!

చాణూరుడు:
ఓ...అలాగా? అయితే ఆలశ్యం దేనికి...?

బలరాముడు:
మా అభిప్రాయం కూడా అదే!

కృష్ణయ్య: చాణూరా...! నామాట కూడా విను!
" నీ తోడుత నే బెనగద
బ్రీతిన్ ముష్టికునితోడ బెనగెడి బలుడు
గ్రాతప మల్లాహవమున
భూతల నాథునికి మెచ్చు బుట్టింప సభన్."

**చాణూరుడు :**

( వికటంగా నవ్వి )

ఆఁ...! అంత ఉబలాటంగా ఉందన్న మాట!
అయినా, మళ్లీ ఆలోచించు కోవటం మంచిదేమో ?

" నాతో బోరగ నెంతవాడ విసిరో
నా పాటియే నీవు వి
ఖ్యాతుండం గులజుండ సద్గుణుడ స
త్కర్మ స్వభావుండ నీ
కేతా దృగ్విభవంబు లెల్ల గలవే
యీ వీట బోరాడుటల్
ప్రేతల్ చూడగ గుప్పిగంతు లిడుచే
వీక్షింపు గోపార్భకా!"

**కృష్ణయ్య:** ( బలరామునితో )

...ఇతనిలో ఆత్మస్తుతి యెంతఉందో, పరనింద కూడా
అంతగానూ ఉంది.

**బలరాముడు:**

ఉఁహూఁ! సరైన పోటరికి యెప్పుడూ యిన్ని మాట
లుండవు!

**కృష్ణయ్య:** అతనికున్న బలహీనతల్లో అదొకటి; మన మేంచేస్తాం?

**చాణూరుడు :**

( ఉద్రేకంతో )

...ఆఁ...! ఏమన్నావ్ ?

( ముష్టికునితో )

...వింటున్నావా ? వాడు మనిషల్లే మాట్లాడటం
లేదు ; తను సాక్షాత్తు ఆ శ్రీహరి అనే అనుకుంటు
న్నాడు!

**ముష్టికుడు:**

కుఱ్ఱతనం అంటేనే అది! అయినా, అది కూడా అతనికి
తెలియ చెప్పటం మన ధర్మం కదూ!

**చాణూరుడు:**

...నిజమే!

( కృష్ణయ్యతో )

...కృష్ణయ్యా...! నిన్ను చూసినా, నీ గర్వాన్ని చూసినా, మాకు చాలా జాలివేస్తోంది. నువ్వు నిజంగా ఆ నారాయణుడివే అనుకుందాం. అయినా... యిది...

" మహిమతో నుండంగ మధురాపురముగాని
పాలుపారు వైకుంఠ పురముగాదు
గర్వంబుతోనుండ గంసుని సభగాని
సంసార రహితుల సభయు గాదు
ప్రకటించి వినగ నా బాహునాదము గాని
నారదు వీణా స్వనంబుగాదు
చదురులాడగ మల్లజన విగ్రహముగాని
రమతోడి ప్రణయ విగ్రహము కాదు
వెలసి తిరుగంగ వేదాంత వీథిగాదు
మొఱగి పోవంగ ముని మనోమూల గాదు
సాగి నడవంగ భక్తులజాడ గాదు
*కృష్ణ మాముందు నీయాట లేల నింక *"

**కృష్ణయ్య:** ఉఁహుఁ...! చివరిమాటలు కాబోలు...పాపం!

[ బలరామ కృష్ణులు ఒకరి వంక ఒకరు చిలిపిగా చూసుకున్నారు; ముందుకు సాగారు.

రంగంలోకి దిగగానే కృష్ణయ్య జబ్బ చరిచాడు. అది ఉరుము మాదిరి మోగింది. దాంతో, చాణూర ముష్టికుల గుండెలు దద్దరిల్లి పోయినై. కంసుని శరీరం కంపించిపోయింది.

ఆ వెంటనే, బలరామ కృష్ణులు, తమ ముందున్న మల్లుల వేపు తమ చేతులు చాచారు. మరు క్షణంలో చేతులూ చేతులూ కలిసినై. సభలో కలకలం ప్రారంభమయింది. ]



## ★ 26. వ రంగం ★

[ మల్లరంగస్థలం నుంచి, స్త్రీలు, గుంపులు గుంపులుగా బయటికి వస్తున్నారు. అందరి ముఖాలలోనూ అదోవిధమైన ఆందోళన కనబడుతోంది. ఎవరిమట్టుకు వారు యేదో చెప్ప రాని బాధ పడుతున్నారు; గుసగుసలు పోతున్నారు. ]

స్త్రీ౧: 1. అబ్బ...! అది మనం చూడలేమమ్మా!

2. మనమేకాదు: మంచీ చెడ్డా తెలిసినవాళ్లు యెవరూ చూడలేరు!

3. ఉహుఁ! అది ఆ మహారాజు ఒక్కడికే చెల్లింది అంతే!

4. పోనీ, ఆయనకు తోచలేదే అనుకుందాం; ఆయన ప్రక్కన ఉన్న వాళ్లయినా 'యిది అన్యాయం' అని చెప్పద్దూ?

1. మంచి మాటన్నావ్! మల్లులకూ పిల్లలకూ మధ్య పోరుపెట్టి మర్యాదస్తుల్లే చూస్తూ కూర్చున్నారు!

[ అంతలో లోపలనుంచి పెద్దపెద్ద పిడిగ్రుద్దుల మోతలూ, హాహాకారాలూ, జేజేలూ అమితంగా వినిపించినై. ఆ వెంటనే, జనం ఉరుకులు పెడుతూ బయటపడ్డారు. ]



## ★ 27. మ, రంగం ★

[ మల్లరంగ స్థలం చాలావరకు ఖాళీగా ఉంది. కంసాదులూ బలరామ కృష్ణులూ, నందుడూ మొదలైన గోపకులూ మాత్రమే అక్కడ ఉన్నారు. చాణూరముష్టికులు క్రింద పడి ఉన్నారు. వారిముందు కృష్ణబలరాములు నుంచున్నారు. ఆ ప్రదేశమంతా అతిభీభత్సంగా ఉంది.

కంసుడు, నిప్పులు క్రక్కుతూ, బలరామ కృష్ణులవంక చూస్తున్నాడు. అతని శరీర మంతా క్రోధంతో కంపించి పోతోంది. అలా ఒక క్షణంసేపు నుంచుని అతను తన అనుచరుల వేపు తిరిగాడు. ]

**కంసుడు :** ...ఇంకా చూస్తారేం ?

" వల్లవబాలురన్ నగరి
వాకిటికిన్ వెడలంగ* ద్రోయుడీ
గొల్లల ముట్టికోల్ గొనుడు
క్రూరుని నందుని గట్టు డుర్వికిం
దెల్లముగాగ నేడు వసు
దేవుని జంపుడు తండ్రి గాడు వీ
డెల్లవిధంబులం బరుల
కిష్టుడు గావకు డుగ్రసేనునిన్ "

[ ఆ మాటలు విన్న నందాదులు అదలిపోయినారు. ఉగ్రసేనుడు మందహాసం చేశాడు. అంతలో, కంసుని సైనికులు బలరామ కృషులమీదికి ఉరికారు. అది చూసిన బలరామ కృష్ణులు, ' ఆగం డాగండి ! ' అని హుంకరించారు. అదివిన్న భటులు గజ గజలాడిపోతూ, యెక్కడి వా రక్కడే నిలబడి పోయినారు. ]

...ఊఁ... వెళ్లండి... ! భయపడకండి... ! కత్తికో ముక్కగా నరి కెయ్యండి !

[ 'ఇక చూస్తూ ఉంటే లాభంలేదు' అన్నట్టుగా బలరాముడు కృష్ణయ్య వంక చూశాడు. ఆ వెంటనే, కృష్ణయ్య, కంసుని మీదికి ఉరికాడు.

కంసుడు కత్తిదూసి నిలబడ్డాడు. కృష్ణయ్య, తన ఖడ్గాన్ని అతనిమీదికి విసిరాడు. ఆ వెంటనే కంసుని కత్తి యెగిరి అవతల పడ్డది. కృష్ణయ్య వికటాట్టహాసం చేశాడు.

సభికుల్లో కొందరు, 'కృష్ణా.. ! కృష్ణా !' అని అరిచారు. మరికొందరు ప్రాణభయంతో పారిపోయినారు.

అంతలో, కృష్ణయ్య, తన వేపుకు వస్తున్న కంసునిమీదకు యెగిరాడు. ఎగిరి, అతని జుట్టుపట్టుకుని క్రిందికి వంచాడు.

కంసుడు పళ్లు పటపట లాడిస్తూ కృష్ణయ్యను విసిరికొట్టాడు. ఆ దెబ్బతో, కృష్ణయ్య, బంతి మాదిరిగా యెగిరి అవతల పడ్డాడు.

ఆ వెంటనే కృష్ణయ్యా కంసుడూ తిరిగి కలబడ్డారు. ఈ మాటు వారు గదాయుద్ధం చేశారు. ఆ గదలు ఒకదాని నొకటి తాకినప్పుడు, రెండు కొండలు ఢీకొన్న శబ్దం అవుతూ వచ్చింది. పోరాటంలో, మామా అల్లుడూ ఒకరి కొకరు తీసి పోరనిపించింది. అది చూస్తున్నవారి గుండెల్లో బాడలు పడ్డట్టయింది.

ఆ యుద్ధం, అలా కొంతసేపు సాగింది; కాని, చివరకు, కంసుని చేతులో ఉన్న గద ముక్కలు ముక్కలై పోయింది.

ఆ వెంటనే, కృష్ణయ్య, తన గదను, ఓ ప్రక్కకు విసిరి పారేసి, కంసుని ముందు నిలబడ్డాడు. తొడ చరిచాడు. ముష్టియుద్ధానికి అతణ్ణి పురికొల్పాడు.

మరుక్షణంలో కంసుడూ కృష్ణయ్యా పరస్పరం పిడికిటి పోట్లకు దిగారు. ఒక ముహూర్తంలో, కంసుని ధాటికి కృష్ణయ్య తాళుకోలేడా అనిపించింది. అనిపించటమే కాదు ; కృష్ణయ్య క్రిందపడటమూ, కంసుడు అతని గుండెలమీద కూర్చోవటమూ కూడా జరిగింది. అది చూచిన నందాదులు

కంపించి పోయినారు; కృష్ణా...! కృష్ణా...!!' అంటూ అమితమైన బాధతో హాహాకారాలు చేశారు. కంసుని సోదరులు మాత్రం కరతాళ ధ్వనులు చేశారు. ఆనందంతో అట్టహాసం చేశారు.

అంతలో, క్రిందపడి ఉన్న కృష్ణయ్య, చూసిచూసి కంసుని గుండెలో ఒక్కపోటు పొడిచాడు. దాంతో, కంసుడు ఒరిగిపోయినాడు. ఆ వెంటనే కృష్ణయ్య అతనిమీద యెక్కి కూర్చున్నాడు; పిడిగుద్దుల వర్షం కురిపించాడు.

అప్పుడు కంసుడు చేసిన హాహాకారాలు మధురానగర మంతటా మారు మోగినై. అతను నెత్తురు కక్కుకున్నాడు. ఆ వెనుక తల ఒరగేసి కన్ను మూశాడు.

అది చూచిన కంసుని సోదరుల ఆగ్రహానికి అంతులేక పోయింది. వారి ఆవేశం హద్దులు మీరిపోయింది. అందుకనే వారు ఒక్కమారుగా కృష్ణయ్యమీద పడ్డారు. కృష్ణయ్యకూ వారికీ కొంతసేపు పోరాటం జరిగింది. అంతలోనే, బలరాముడు అక్కడే పడిఉన్న ఒక ఖడ్గాన్ని అందుకుని వాళ్లమీదికి ఉరికాడు. మరుక్షణంలో, వాళ్లు, మరణవేదన పడుతూ నేల కొరిగారు.

ఆ వెంటనే, ఆకాశంలోనుంచి, శంఖారావాలూ, దుందుభి మోతలూ వినిపించినై. బలరామ కృష్ణుల మీద పుష్ప వర్షం కురిసింది. గోపకు లందరూ వారికి జేజేలు చెప్పారు.

అంతలో, నందాదులు వచ్చి, కృష్ణబలరాములను కౌగిలించు కున్నారు. ఆనందబాష్పాలతో వాళ్లను పూర్తిగా తడిపేశారు.

బలరామునకు అప్పు డేదో ఆలోచన తట్టింది. వెంటనే అతను అక్కడినుంచి ఉరుకుతూ వెళ్లాడు.

అదే సమయానికి, కంసుని భార్యలు అస్తి, ప్రాప్తి అనేవారు అక్కడకు పరుగెత్తుకుంటూ వచ్చారు. వచ్చీ రావటంతోటే కంసునిమీద పడి యేడువసాగారు.

[ కృష్ణయ్య, వారి వంక తలయెత్తి చూడలేకపోయినాడు. ఆదోవిధమైన బాధపడ్డాడు. క్రిందికి చూస్తూనుంచున్నాడు.]

అస్థి: "గోపాల సింహంబు గోపించి వెల్వడి
నిను గజేంద్రము భంగి నేడు గూల్చె
యాదవేంద్రా నిల మాభీల జవమున
నిను మహీజము మాడ్కి నేల వ్రాల్చె
వాసుదేవాంభోధి వారి యుద్వేలమై
నిను దీవి కైవడి నేడు ముంచె
దేవకీసుత వజ్రిదేవత లలరంగ
నినుగొండ క్రియ నేడు నిహతుజేసె
హా మనోనాథ హావీర హా మహాత్మ
హా మహారాజ నీ విట్లు హతుడవైన
మనుచు సుస్నార మక్కట మమ్ముబోలు
కఠిన హృదయులు జగతిపై గలరె యెందు"

[ అలా రోదిస్తున్న అస్థిని కృష్ణయ్య సమీపించాడు. ఆమె వంక సానుభూతితో చూశాడు. ఆయన కళ్లు కూడా చెమ్మగిలినై. ]

కృష్ణయ్య: ...అత్తయ్యా !

[ అంటూ కృష్ణయ్య ఆమెప్రక్కగా కూర్చున్నాడు. ఆమె అతణ్ణి చూడగానే తిరిగి ఆవురుమన్నది ; అతని మీదకు వ్రాలిపోయింది. కృష్ణయ్య ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

...ఏమిటీ అజ్ఞానం? అన్నీ తెలిసిన వాళ్లే యిలా అయితే యెలా? మామయ్య మరణం మాకు మాత్రం బాధగా లేదూ?...ఉంది! అయినా యేం చేస్తాం? ఏది యెలా జరగాలో అలా జరుగుతుంది గాని, మనకోసం ఆగుతుందా? ఇంతకూ, లోకకంటకుడైన రాజు మరణించాడు. అది నిజంగా ఆనందించవలసిన విషయం కాదూ?

...అదీకాక ఆయన కిప్పుడు కైవల్య ప్రాప్తి కలిగింది. అది గ్రహిస్తే నువ్విలా అటమటిస్తావా? ఊఁ...?

...విచారపడకు! ఆయనకోసం విచారపడటం ఆయనకు అధోగతి కలిగించటమవుతుంది. నామాట విను! శాంతించు!

[ అస్థి ఆ మాటలువిని తిరిగి అతణ్ణి ఆలింగనం చేసుకుంది. అంతలో, ఉగ్రసేనుడు అడుగుల్లో అడుగులువేసుకుంటూ, కృష్ణా! కృష్ణా!" అని, అమితమైన వేదనతో అరుస్తూ అక్కడికి వచ్చాడు.

అతణ్ణి చూడగానే కృష్ణయ్య కళ్లలో నీళ్లు తిరిగినై. అతను 'తాతయ్యా!' అని ఆప్యాయతతో పిలుస్తూ ఆయనకు యెదురు వెళ్లాడు; ఆయన పాదాలమీద వ్రాలాడు.

ఉగ్రసేనుడు కృష్ణయ్యను లేవనెత్తాడు. ఉబికి వచ్చే ఉద్రేకంతో అతణ్ణి కౌగిలించుకున్నాడు. ]

ఉగ్రసేనుడు :

కృష్ణా...!నాయనా...!

కృష్ణయ్య: ...తాతయ్యా!

[ ఉగ్రసేనుడు కుళ్లి కుళ్లి యేడువ సాగాడు. కృష్ణయ్యతో యేదో చెప్పుకోవాలని ఆయన యెంతగానో ప్రయత్నించాడు; కాని, నోటివెంట మాట పెగిలిరాలేదు. ఆయన ఆ పాద మస్తకం ఒణికి పోయినాడు; కన్నీటిలో కరగి పోయినాడు. ]

కృష్ణయ్య: ...తాతయ్యా...! ఏమిటీ విచారం?

ఉగ్రసేనుడు:

...విచార పడక యేంచేసేది నాయనా? మామయ్యలు ముగ్గురూ మరణించారు. ముసలివాణ్ణి నేను ఒక్కణ్ణే మిగిలాను...ఒక్కణ్ణే మిగిలి ఉన్నాను.

[ అంటూ, అతను తిరిగి భోరున యేడ్చాడు. ]

కృష్ణయ్య: ఇదేమిటి ? ఇలా గుండె చెరువు చేసుకుంటే యే మౌతుంది ? అయినా, యెవరి కర్మ వారిది. రోజులు తీరిన వాళ్లు వెళ్లకా తప్పదు; ఉన్నవాళ్లు ఉండ కాతప్పదు. దీనికి యింతగా విచారపడితే యెలా?

ఉగ్రసేనుడు:

...నిజం నాయనా...నిజం. నువ్వు చెప్పింది ముమ్మా టికీ నిజం. కాని, నా విచారం అది కాదు. నేను, మూడుకాళ్ల ముసలి నైనాను. ఇతరుల సహాయం లేకపోతే యెందుకూ పనికిరాని స్థితిలో పడ్డాను. ఇక నేను ఒంటరిగా యెలా బ్రతకాలీ అని! ఎవరి అండ చూసుకుని కాలం వెళ్లదీసుకోవాలీ అని !

[ ఆమాట అంటూనే, ఉగ్రసేనుడు, తిరిగి కృష్ణయ్య మీద ఒరిగిపోయినాడు. కృష్ణయ్య అతనివంక సానుభూతిలో చూశాడు. ]

కృష్ణయ్య: తాతయ్యా...! ఆ విచారం నీకు దేనికి? విచార పడి నువ్వు చేయ గలది యేమైనా ఉందా ?

[ ఉగ్రసేనుడు కృష్ణయ్య ఉపశమన వాక్యాలు వింటూ అతని కళ్లల్లోకి చూడసాగాడు. ]

...పుట్టించటం, పోషించటం, గిట్టించటం అవన్నీ ఆయన చూసుకుంటాడు. అదంతా ఆయన విలాసం. మన ఆలోచనలూ, ఆందోళనా ఆయన నిర్ణయాన్ని అణుమాత్రంగా కూడా మార్చ లేవు. అందులో నీకు తెలియం దేముంది ...?

[ అది విన్న ఉగ్రసేనుడు "నాయనా...! నాయనా !" అంటూ కృష్ణయ్యను గాఢంగా కౌగిలించుకున్నాడు. ]

...విచార పడకు... తాతయ్యా! నువ్వే యిలా అయితే నీ వాళ్లందరూ యేమైపోవాలి? అంతే కాదు; యిక యీ ప్రజను పాలించే దెవరు? ఈ రాజ్యాన్ని రక్షించే దెవరు?

ఉగ్రసేనుడు: ( కొంచెంగా మనసును దిట్టపరచుకుని )

...అన్నింటికీ నువ్వే ఉన్నావు నాయనా! నువ్వు చెప్పినట్టు ఆ ఆలోచన మాత్రం నాకు దేనికి?

కృష్ణయ్య: ( మందహాసం చేస్తూ )

అదేమిటి...? ఇందులో నాదేముంది?

[ అంటూ ఉండగానే ఉగ్రసేనుడు తిరిగి కృష్ణయ్యను హృదయానికి హత్తుకున్నాడు; 'తండ్రీ...! నా తండ్రీ...!' అంటూ. ]

... తాతయ్యా...! ప్రస్తుతం మధురానగరం రాజులేని రాజ్యమైపోయింది. మరి కొంతకాలం యిలాగే ఉంటే అరాచకం ప్రబలి పోవచ్చు. అలా కాకుండా చూడటం మన ధర్మం కాదూ...?

[ 'ఔ' నన్నట్టుగా ఉగ్రసేనుడు తల ఆడించాడు. ]

...అందుకనే చెబుతున్నాను. లే...! లేచి, అనాథగా పడి ఉన్న రాజ్యలక్ష్మిని తిరిగి సనాథగా నిలబెట్టు! అదీ నీ ధర్మం!

ఉగ్రసేనుడు:

...కావచ్చు నాయనా...అది నాధర్మమే కావచ్చు. కాని, దాన్ని నిర్వహించుకునే శక్తి యిప్పుడు నాలో ఉందా? లేదు! ఇక యేంచేసినా నువ్వే! నువ్వే నాయనా...ముమ్మాటికీ నువ్వే!

కృష్ణయ్య: అలా కాదు తాతయ్యా! నామాట విను!

" అనఘ యయాతి శాపమున
యాదవ వీరులకున్ నరేశ్వరా
సనమున నుండరాదు నృప
సత్తమ రాజవు గమ్ము భూమికే
నిను గొలువంగ నిర్జరులు
నీ కరి బెట్టుదు రన్యరాజులం
బనిగొను టెంత *లెమ్ము* జన
పాలన శీలివి గమ్ము వేడ్కతోన్ "

[ ఆ మాట వినగానే ఉగ్రసేనుడు 'బాబూ!' అంటూ కృష్ణయ్యను చుట్టేసుకున్నాడు. కృష్ణయ్య ఆయన వంక ఒక క్షణం సేపు సానుభూతితో చూశాడు. ఆ వెంటనే నందాదుల వేపు తిరిగి మందహాసం చేశాడు.

అది చూసిన, గోపకులందరూ, ఒక్క గొంతుతో, 'శ్రీ శ్రీ శ్రీ ఉగ్రసేన మహారాజుకూ... జై!' 'శ్రీ శ్రీ శ్రీ మధురానగరాధిపతికీ... జై!' అన్న నినాదాలు చేశారు. ]



## ★ 28. వ రంగం ★

[ అది వసుదేవుడూ దేవకీ ఉన్న కారాగారం. వారి సంకెలలు విడిపించి, వారితో సహా బలరాముడు బయటకు వస్తున్నాడు.

అంతలో కృష్ణయ్యా వారికి యెదురైనాడు. దేవకీ వసుదేవులు అమితానందంతో అలాగే నిలబడిపోయినారు.

మరు క్షణంలో, కృష్ణయ్యా, తన తల్లి తండ్రుల కౌగిట్లో యిమిడిపోయినాడు. బలరాముడు మందహాసం చేస్తూ, ఓ ప్రక్కగా నుంచున్నాడు. ]

వసుదేవుడు:

...నాయనా...!...కృష్ణా...!!

కృష్ణయ్యా: ...నా...న్నా...!!

దెవకి : ...కన్నారీ...! కృష్ణయ్యా...!!

కృష్ణయ్యా: ...అ...మ్మా...!!

దేవకి : ...ఎన్నాళ్లకు కనపడ్డావు నాయనా ? ఎంత వాళ్లైనారు బాబూ!

కృష్ణయ్యా: ఎంతవాళ్లమైతే యేం లాభమమ్మా! మీకు మావల్ల కలిగిన సుఖ మేముంది ?

" కారాశాలల మా నిత్తము మిముం
గంసుండు గారింపగా
వారింపంగ సమర్థతల్ కలిగియున్
వారింపగా రాక ని
ష్కారుణ్యాత్ములమైన క్రూరుల మహా
కౌటిల్య సంచారులన్
సారాతిక్షములార మమ్ము గొఱతల్
సైరించి రక్షింపరే !

[ ఆ మాటలు విని, దేవకీ వసుదేవులు తిరిగి కృష్ణయ్యను హృదయానికి హత్తుకున్నారు. ]

**వసుదేవుడు:**

ఇవన్నీ యేమిటి నాయనా...! మా కడుపున మీరు పుట్టడమే మాకు పదివేలు.

**బలరాముడు:**

అదికాదు నాన్నా! మేము మీకు చేసిన సేవ యేముందీ అని?

" చెల్లు బడిగలిగి యెవ్వడు
తల్లికి దండ్రికిని దేహధనముల వృత్తుల్
చెల్లింప డట్టి కష్టుడు
ప్రల్లదు; డా మీద నాత్మపలలాశి యగున్ "

...అందుకే మేం యెప్పుడూ బాధపడుతూ ఉంటాం!

**దేవకి:** అదేమిటి నాయనా! ఇప్పుడు మాత్రం మాకు యేం తక్కువ అయింది? మీరు యెక్కడో అక్కడ కులాసా ఉన్నారని వింటున్నాం. మీరు చేసే లీలలన్నీ గ్రహిస్తున్నాం; సంతోషిస్తూనే ఉన్నాం. అంత కంటె మాకు కావలసిం దేముంది?

**కృష్ణుడు:** అదికాదమ్మా!

" జననీ జనకుల వృద్ధుల
దనయుల గురు విప్రసాధు దారాదుల నే
జనుడు ఘనుడయ్యు బ్రోవక
వనరును జీవన్మృతుండు వాడు ధరిత్రిన్. "

అది తెలిసి కూడా మే మలాగే తయారైనాం; యేం చేసేది?

[ అలా అంటూనే కృష్ణయ్య కన్నీరు పెట్టుకున్నాడు. అది గ్రహించిన దేవకీ వసుదేవులు మరొకసారి అతణ్ణి ఆప్యాయంగా ఆలిగనం చేసుకున్నారు.



## ★ ముఖ్యపాత్రలు ★

1. కృష్ణయ్య
2. బలరాముడు
3. సాందీపని
4. సముద్రుడు
5. యముడు



# గురుదక్షిణ

## ★ 1. వ రంగం ★

[ ఒక కథకుడు శ్రీ కృష్ణ బలరాముల గురుభక్తిని గురించి చెబుతున్నాడు. ]

కథకుడు: శ్రీకృష్ణుడు కంసుని వధించిన తరువాత, నందాదులు బృందావనానికి తిరిగి వెళ్లారు. తల్లి దండ్రులతోనూ, యితర బంధుమిత్రులతోనూ కొంతకాలం గడపాలని కృష్ణ బలరాములు మధురలోనే ఉండి పోయినారు. ఆ తరువాత, గర్గుడు మొదలైన బ్రాహ్మణులను పిలిపించి, వసుదేవుడు, శ్రీకృష్ణ బలరాములకు ఉపనయనం చేయించాడు. అది కాగానే...

" ఉర్విన్ మానవు లెవ్వరైన గురువా
కొశ్యదుక్తులై కాని త
త్పూర్వా రంభము సేయబోల దనుచున్
బోధించు చందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువులై
సంపూర్ణులై యుండియుం
గుర్వంగీకరణంబు సేయ జని రా
గోవిందుడున్ రాముడున్ "

ఆ వెళ్లటం వెళ్లటం వారు వారణాశికి వెళ్లారు. అక్కడ, సర్వవిద్యా విలాసి అయిన సాందీపనివద్ద శిష్యులుగా చేరారు. ఆయన, వారికి, అతి ప్రేమతో అన్ని విద్యలూ నేర్పాడు. వాళ్లుకూడా, అన్నీ

తెలిసిన వాళ్లు కావడంవల్ల, అరవైనాలుగు విద్యలూ అరవైనాలుగు రోజుల్లో నేర్చుకున్నారు. ఆ విధంగా...

"గురువులకు నెల్లగురులై
గురులఘు భావములు లేక కొమరొందు జగ
ద్గురులు త్రిలోక హితార్థము
గురు శిష్యన్యాయలీల గొలిచిరి వేడ్కన్"

అలా కృతకృత్యులైన శిష్యులను చూసి, వారి మాహాత్మ్యానికి అబ్బురపడుతూ, సాందీపని ... ఓ నాడు...



## ★ 2. వ, ర ం గ ం ★

[ బలరామ కృష్ణులు సాందీపని సముఖాన కూర్చుని ఉన్నారు. ]

**సాందీపని:** నాయనలారా!

" అంభోరాశి ప్రభాసతీర్థమున ము
న్నస్మత్తనూ సంభవుం
డంభోగాహము సేయుచున్ మునిగి లే
డయ్యెం గృపాంభోనిధుల్
శుంభద్వీర్యులు మీరు మీగురునికిం
జోద్యంబుగా శిష్యతన్
గాంభీర్యంబున బుత్ర దక్షిణ యిడం
గర్తవ్యమూహింపరే!"

**కృష్ణయ్య:** స్వామీ! అంతకంటె మీకు మే మివ్వగల గురుదక్షిణ మాత్రం యేముంటుంది? ఈ రూపేణా, మీ ఋణాన్ని కొంత వరకయినా తీర్చుకోవటం మా అదృష్టం కదూ!

[ ఆ మాట విని సాందీపని చాలా సంతోషించాడు; మానంగానే వారిని ఆశీర్వదించాడు. ]



## ★ 3. వ, రంగం ★

[ అది సముద్ర తీరం. కృష్ణయ్య విల్లు యెక్కుపెడు తున్నాడు. బలరాముడు అది చూస్తూ అతని ప్రక్కనే నుంచున్నాడు. ]

**బలరాముడు:**

కృష్ణా! తొందర పడుతున్నా వేమో!

**కృష్ణయ్య:** ఏమీ లేదు. వారి కుమారుణ్ణి సాగరుడే మ్రింగాడని సాందీపని చెప్పారు. అందుకనే సాగరుని సంహారింప దలచాను!

**బలరాముడు:**

సాందీపని మాటను శంకించ మనటం లేదు. అయినా, దానికి, సాగరు డేమి సమాధానం చెబుతాడో వినటం సమంజసం కదూ?

[ కృష్ణయ్య 'ఔ' నన్నట్టుగా తల పంకించాడు. అంతలో సముద్రంలోనుంచి హోరున మోత విన వచ్చింది. ఆ వెంటనే, సముద్రుడు కృష్ణ బలరాములయెదుటకు వచ్చాడు. ]

**సముద్రుడు:**

కృపాసింధూ...! కృష్ణా! కృష్ణా!! ఏమిటి నాయనా...యీ అకారణమైన ఆగ్రహం?

**కృష్ణయ్య:** ( ఉద్రేకంతో )

"సాగర సుబుద్ధి తోడను
మా గురు పుత్రకుని దెమ్ము మాటాడిన నీ
వాగడ మవుదువు దుస్సహ
వేగ రణాభీల నిశిత విశిఖాగ్నులకున్"

సముద్రుడు:

స్వామీ ...!

"వంచన యింతలేదు యదు
వల్లభులార ప్రభాసతీర్థమం
దంచిత మూర్తి విప్రసుతు
డార్యుడు తోయము లాడుచుండ ను
త్సంచలితోర్మి యొక్కటి ప్ర
చండ గతిం గొనిపోయె బోవగా
బంచజనుండు మ్రింగె నతి
భాసుర శీలుని విప్రబాలునిన్"

ఇందులో నా తప్పే ముందో మీరే విచారించండి!

[ బలరాముడు సాగరునివంక సానుభూతితో చూశాడు. కృష్ణయ్య సిగ్గుపడుతూ తల వంచుకున్నాడు. ]

కృష్ణయ్య: ...సాగరా! ... క్షమించు!!

సముద్రుడు:

అయ్యయ్యో ...! అదేమిటి స్వామీ ...? నారాయణాంశ సంభూతులు మీ రేమిటి; నన్ను క్షమాపణ వేడట మేమిటి?

కృష్ణయ్య: సాగరా! చేసిన తప్పును ఒప్పుకోవట మన్నది పిన్నల పనే కాదు. నిన్ను నేను అకారణంగా అనుమానించాను; నీకు అంతులేని ఆవేదన కలిగించాను. అది అనుచితమైన కార్యం కాదూ? అందుకనే క్షమించమని అడుగుతున్నాను.

[ ఆ మాటలు విన్న సాగరుడు నిలువునా నీరైనాడు. "ప్రభూ...! ప్రభూ... !!" అంటూ, కృష్ణయ్య పాదాల మీద వ్రాలాడు.

అది చూసి, బలరాముడు మందహాసం చేశాడు. ]



## ★ 4. వ్ర, రంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథను చెబుతున్నాడు. ]

**కథకుడు:** ఆ తరువాత, సాగరుడిచ్చిన ఆతిథ్యాన్ని స్వీకరించి, రామ కృష్ణులు పంచజనుని పట్టుకోవటానికి వెళ్లారు.

" శంఖారావము తోడ బంచ జనుదుర్గ
శంకించి చిత్తంబులో
సంఖున్నుండుగ వార్ధి జొచ్చి దహన
జ్వాలాభ హేమోజ్వల
త్పుంఖాస్త్రంబున గూల్చి వాని జఠరంబుగ్
వ్రచ్చి గోవిందు డ
ప్రేంఖచ్చిత్తుడు బాలు గానక గురు
ప్రేమోదితోద్యోగుడై "

" దానవుని దేహజంబగు
మానిత శంఖంబు గొనుచు మసలక బలుడుం
దో నేతేరగ రథియై
దానవరిపు డరిగె దండధరు పురి * కంతగ్ "

అలా వెళ్లి, కృష్ణయ్య 'సంయమని' అనే పట్టణం చేరుకున్నాడు. అక్కడ ...



## ★ 5. ప్రరంగం ★

[ యమధర్మరాజు కొలువు దీరి ఉన్నాడు. చిత్రగుప్తుడు మొదలైన వాళ్లు ఉచితాసనాలమీద ఉపవిష్టులై ఉన్నారు. అందరూ యేదో ఆలోచిస్తున్నారు. అంతలో వారికి శంఖారావం వినిపించింది. అందరూ అది వినిపించిన వేపుగా చూశారు. యమధర్మరాజు నిప్పులు క్రక్కుతూ చిత్రగుప్తుని వంక చూశాడు. ]

**చిత్రగుప్తుడు:**

ఉఁహుఁ! ఎవరో ... పాపం!

**మంత్రి:** ఎవరో యేమిటి ...? ఆయువు తీరినవాళ్లే అయి ఉంటారు!

[ ఆ మాట వింటూనే యముడు గబగబా బయటకు వెళ్లాడు. అతని సహచరులు అతణ్ణి అనుసరించారు. ]



## ★ 6. వ, రంగం ★

[ నగర ద్వారం ముందు రామకృష్ణులు నుంచుని ఉన్నారు. కృష్ణయ్య శంఖం పూరిస్తున్నాడు.

అంతలో యమధర్మరాజు అక్కడకు వచ్చాడు. రామకృష్ణులను చూడగానే అతనికి అంతులేని ఆనందం కలిగింది. అతని అహంభావ మంతా అణగారిపోయింది. అతి వినయంతో అతను వారి వేపుగా అడుగులు వేశాడు. ]

**యముడు:** ఓహోహోహో ...! ఎంత అదృష్టం ... యెంత అదృష్టం! నారాయణ స్వరూపులేమిటి.. నా నగరానికి రావట మేమిటి? ఆహాహా!

[ అలా అనుకుంటూనే అతను బలరామ కృష్ణులను సమీపించాడు. ]

...దయచెయ్యండి...! దయాసముద్రులు దయ చెయ్యండి!!

[ అంటూ, అతడు వారికి గౌరవ పూర్వకంగా స్వాగతం చెప్పాడు. ]



## ★ 7. వ, రంగం ★

[ అది యమధర్మరాజు సభా భవనం. యముడు దారి తీస్తూ ఉండగా రామకృష్ణులు ప్రవేశించారు. ఆ వెంటనే అతను చూపిన ఆసనాలమీద వారు కూర్చున్నారు.

యమధర్మరాజు, చేతులు జోడించి, కృష్ణయ్య ముందు నుంచున్నాడు. ]

**యముడు:** స్వామీ ...! మీ రాకతో నా మందిరం పావనమయింది. మీ దర్శనంవల్ల నా జీవితం ధన్యమయింది.

[ కృష్ణ బలరాములు మందహాసం చేశారు. ]

... దాసాను దాసుణ్ణి ... ఆజ్ఞకోసం యెదురు చూస్తున్నాను!

**కృష్ణయ్య:** ధర్మరాజా! మా గురుడైన సాందీపని కుమారుడు మీదగ్గర ఉన్నాడని తెలిసింది.

**యముడు:** చిత్తం ...! ఇదుగో ...!

[ అంటూ తన ప్రక్కనే ఉన్న ఒక చక్కనయ్యను చూపించాడు. ఆ కుఱ్ఱవాడు అక్కడినుంచే రామ కృష్ణులకు నమస్కరించాడు. ]

**కృష్ణయ్య:** మేము యితడినే ఆ సాందీపనికి గురుదక్షిణగా సమర్పించుకో దలచాం!"

[ అది విన్న యముడు మహాశ్చర్యాన్ని పొందాడు. 'పరమేశ్వరా!' అంటూ కృష్ణయ్య పాదాలమీద వ్రాలాడు. అంతలో ఆకుఱ్ఱవాడు రామ కృష్ణులను సమీపించాడు. వారు యమధర్మరాజును ఆప్యాయంగా లేవనెత్తి, ఆ కుఱ్ఱవాణ్ణి దగ్గరకు తీసుకున్నారు; సంతృప్తితో మందహాసం చేశారు. ]



## ★ 8. వ, రంగం ★

[ అది సాందీపని ఆశ్రమం. సాందీపని, అక్కడొక ఆసనంమీద ఉన్నాడు. ఆయన శిష్యులు ఆయన చుట్టూ కూర్చున్నారు.

సాందీపని యేదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. అంతలో కృష్ణ బలరాములు, ఆయన కుమారునితో సహా, అక్కడకు వచ్చారు.

వారిని చూసిన సాందీపని, తన కళ్లను తానే నమ్మలేక పోయినాడు. అంతలో, ఆయన కుమారుడు 'నాన్నగారూ...!' అంటూ ఆయన్ను చుట్టేసు కున్నాడు.

అది చూసిన బలరామ కృష్ణులు అమితమైన ఆనందంతో అక్కడే నిలబడి పోయినారు. అది గ్రహించిన సాందీపని చూపుల్లో కృతజ్ఞత తొణికిసలాడింది. ]

సాందీపని: ... నాయనలారా!

"గురునకు గోరిన దక్షిణ
గరుణన్ ము న్నెవ్వడిచ్చె ఘనులార భవ
ద్గురునకు గోరిన దక్షిణ
దిరముగ నిచ్చితిరి మీరు దీపిత యశులై"

"కాలుని వీటికి జని మృత
బాలకు దే నొరుల వశమె భవదీయ కృపన్
మేలు దొరకొనియె మాకు వి
శాల మగుం గాత మీ యశము లోకములన్"

[ ఆ దీవన నందుకుంటూ బలరామ కృష్ణులు సాందీపని ముందు సాష్టాంగ పడ్డారు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

1. కృష్ణయ్య
2. కాలయవనుడు
3. ముచికుందుడు
4. నారదుడు



# కాలయవనుని వధ

## ★ 1. వ్రరంగం ★

[ ఒక కథకుడు కాలయవనుని వధకు సంబంధించిన గాథను చెబుతున్నాడు. ]

**కథకుడు:** ... గురువర్యుడైన సాందీపని దీవనలు పొంది, బలరామ కృష్ణులు మధురానగరం చేరుకున్నారు; అక్కడ, కొంతకాలం కులాసాగా కాలం గడిపారు. అంతలో మరొక ఉపద్రవం వచ్చింది.

కంసుడు చనిపోయిన తర్వాత, అతని భార్యలు, మధురా నగరం వదలి తమ పుట్టింటికి వెళ్లారు. వెళ్లి, జరిగిందంతా, తమ తండ్రి అయిన జరాసంధునికి తెలియ బరిచారు.

జరాసంధునికి అంతులేని కోపం వచ్చింది. అతను, యెలాగయినా కృష్ణయ్యమీద పగ సాధించాలని నిశ్చయించు కున్నాడు. ఆ అభిప్రాయంతోనే, మధురానగరం మీదకు దండెత్తి వెళ్లాడు.

జరాసంధుడూ కృష్ణయ్యా పదిహేడుసార్లు యుద్ధం చేశారు. పదిహేడుసార్లూ కూడా, జరాసంధునికే పరాజయం కలిగింది.

అదలా ఉండగా ...



## ★ 2. వ, రంగం ★

[ ఆది, యవన సార్వభౌము డయిన కాలయవనుని మందిరం. కాలయవనుడు, నారదునితో సహా, సభలో ప్రవేశించాడు. ]

**నారదుడు:** " యవనా నీవు సమస్త భూపతుల బా
హాఖర్వ గర్వోన్నతిం
బవనుం డభ్రముల౯ హరించు పగిది౯
భంజించియు న్నేల యా
దవులన్ గెల్వవు వారలన్ మరచియో
దర్పంబు లేకుండియో
యవివేక స్థితి నొందియో వెఱచియో
హైన్యంబునం జెందియో ! "

[ కాలయవనుడు నారదుని వంక ఆశ్చర్యంతో చూశాడు. ]

" యాదవులలోన నొక్కడు
మేదినిపై సత్వరేఖ మెరసి జరాసం
ధాదుల దూలం దోలెను
దాదృశు డిలలేడు వినవె తత్కార్యంబుల్ "

**కాలయవనుడు:**

ఆఁ... ! యాదవులలో అంతవా డున్నాడా ?

" ఏమీ నారద నీవు చెప్పిన నరుం
డే రూపువా డెంతవా
డేమేర౯ విహరించు నెవ్వడు సఖుం
డెందుండు నేపాటి దో

స్సామర్థ్యంబున గయ్యముల్ సలుపు న
స్మద్బాహు శౌర్యంబు సం
గ్రామక్షోణి భరించి నిల్వ గలడే
గర్వాఢ్యుడే చెప్పుమా !"

**నారదుడు:** (వికటంగా నవ్వి)

అతణ్ణి వర్ణించటానికి ఆదిశేషుడు దిగి రావాలి!
మూడు ముక్కల్లో చెప్పాలీ అంటే ... అతను;

" నీలజీమూత సన్నిభ శరీరము వాడు
తామరసాభ నేత్రముల వాడు,
పూర్ణేందు బింబంబు బోలెడి మోమువా
డున్నత దీర్ఘ బాహువుల వాడు,
శ్రీవత్సలాంఛనాంచిత మహోరము వాడు
కౌస్తుభమణి పదకంబు వాడు
శ్రీకర పీత కౌశేయ చేలము వాడు
మకర కుండల దీప్తి మలయు వాడు,
రాజ ! యింతంతవా డనరానివాడు
మెఱసి దిక్కుల నెల్లను మెఱయువాడు
తెలిసి యేవేళ లందైన దిరుగువాడు
పట్టు నేర్చిన గాని లోబడని వాడు"

... కళ్ల కఱవు తీరాలంటే అతణ్ణి చూసి తీరాలి.
శౌర్యాన్ని చవిచూడాలంటే అతణ్ణి కవ్వించి
చూడాలి; అంతే!

**కాలయవనుడు:**

( ఆశ్చర్యంతో )

ఏమిటి యీ పొగడ్త? ఒక నరమాత్రుణ్ణి పట్టు
కుని శ్రీహరిగా వర్ణిస్తున్నారే! ఇంతకూ అతను ...

నారదుడు: ... ఫలానా అని యెలా చెప్పేది? అతని చేష్టలు యెన్ని రకాలుగా ఉన్నయ్యో అతనికి అన్ని పేర్లు ఉన్నై. కాకపోతే, అతణ్ణి, నందాదులు 'నల్లనయ్య'గా పిలుచుకుంటారు; మధురాపురంలో, 'మాధవుడు' అంటారు. మొత్తంమీద 'కృష్ణయ్య' అంటే తెలియని వాళ్లు లేరు; 'కృష్ణా!' అని పిలిచిన వాళ్లకి ఆయన పలకనిదిలేదు!

[ అదివిని కాలయవనుడు పకపక లాడాడు.
అతనివంక చూస్తూ, నారదుడు మందహాసం చేశాడు. ]

కాలయవనుడు:
మహర్షి ...! ఏమిటీ విపరీతం? మా ముందు, మీరు, ఆ యాదవుణ్ణి యింతగా ప్రశంసించటమా?

నారదుడు: ( చిరునవ్వుతో )
యవనా ...! ఇది ప్రశంస కానే కాదు; యథార్థ విషయం!

కాలయవనుడు:
అయితే, అతని ఘనతను మేం అంగీకరించి తీరాలన్న మాట!

నారదుడు: ( చిరునవ్వుతో )
అందరూ చేస్తున్న పనే అది! అదే మీరూ చేస్తే, మీ విశేష మేముంది?

కాలయవనుడు:
( సగర్వంగా తల ఆడించి )
మహర్షుల అభిప్రాయం మా కిప్పుడు అర్థమయింది మే మిక ఆ యాదవుని అంతు కనుక్కుంటాం! మాలో ఉన్న విశేష మేమిటో మహర్షులకే కాదు; మానవ లోకానికి అంతకూకూడా తెలుపుకుంటాం!

[ అంటూనే కాలయవనుడు కత్తి దూశాడు; ఉన్నవాడున్నట్టుగా వెనక్కు తిరిగాడు. ]

నారదుడు: భేష్ ...! పౌరుషమంటే ... యిది!

[ ఆ మాట, కాలయవనుని ఉద్రేకాన్ని మరింతరెచ్చగొట్టింది. అతను ఒకక్షణం సేపు యేదో ఆలోచించి, ఓ ప్రక్కగా ఉన్న తన సేనాపతి వంక చూశాడు. అతని అభిప్రాయాన్ని అర్థం చేసుకున్నట్టుగా, శిరసావహించినట్టుగా, ఆ సేనాపతి తలవంచి యెత్తాడు. ఆ వెంటనే, కాలయవనుడు నారదుని వంక చూశాడు. ]

కాలయవనుడు: ... సెలవా ... ?

[ అదోవిధమైన సంతృప్తితో నారదుడు తల ఆడించాడు. కాలయవనుడు, గిఱ్ఱున వెనక్కుతిరిగి సేనాపతితో సహా వెళ్లి పోయినాడు. ]



## ★ 3. వ, రంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

కథకుడు: ... మరో ఆలోచన లేకుండా, మూడుకోట్ల మంది మ్లేచ్ఛవీరులతో, ఆ వెంటనే, కాలయవనుడు మధురా పురం మీదకు దాడి వెళ్లాడు.

ఆ విషయం శ్రీకృష్ణ బలరాములకు తెలిసింది. వారు చాలా ఆందోళన పడ్డారు.

" యవనుండు పురమెల్ల నావరించెను నేటి
యెల్లింటి లోపల నీ నడుమను
మాగధుండును వచ్చి మనమీద విడియును
యవన మాగధులు మహా ప్రబలులు
పురి రెండు వంకల బోగుదు రట్టిచో
నోపినభంగి నొక్కొక్కచోట
మనము యుద్ధము సేయ మఱియొక్క డెడ సొచ్చి
బంధుల నెల్లర బట్టి చంపు
నొండె గొనిపోయి చెఱబెట్టు నుగ్రకర్ము
డైన మాగధు డది గాన యరివరులకు
విడియ బోరాడగా రాని విషమ భూమి
నొక్క దుర్గంబు సేసి యం దునుపవలయు"

అని వాళ్లు నిశ్చయించుకున్నారు.

ఆ వెంటనే సముద్రుణ్ణి అడిగి, శ్రీకృష్ణుడు, పన్నెండు యోజనాల పొడుగూ పన్నెండు యోజనాల వెడల్పూ గల ఒక దుర్గ ప్రదేశాన్ని సంపాదించాడు. అక్కడ, అద్భుతమైన ఒక పట్టణాన్ని కట్టవలసిందిగా విశ్వకర్మకు ఆజ్ఞాపించాడు.

విశ్వకర్మకూడా, ఆ వెంటనే ...

"వరుణపురము కంటె వాసవు పురికంటె
ధనదు వీటి కంటె దండధరుని
నగరి కంటె బ్రహ్మ నగరంబు కంటె బ్ర
స్ఫుటముగాగ నొక్క పురము జేసె."

అదే ద్వారకానగరం. అందులో ...

"శ్రీకరములు జన హృదయ వ
శీకరములు మందపవన జీర్ణ మహాంభ
శ్శీకరములు హంస విహం
గాకరములు నగరి కువలయాబ్జా కరముల్."

"తురగంబులు కరహతగిరి
శృంగంబులు దానజల వశీకృత భృంగీ
భృంగంబులు పటు శైల స
మాంగంబులు నగరి మత్త మాతంగంబుల్"

"ప్రియములు జిత పవన మనో
రయములు కృత జయము లధిక రమణీయ గుణా
న్వయములు నతిశయములు ని
ర్భయములు హతరిపు చయములు పట్టణ
హయముల్"

అలా తయారైన ఆ మహానగరానికి, మరు క్షణంలోనే మధురా నగర మంతా తరలి వెళ్ళింది. అదంతా అలా జరగటానికి శ్రీకృష్ణుని యోగబలమే కారణం.

తన వారి నందరినీ, ఆ విధంగా, సురక్షిత ప్రదేశంలో చేర్చి, ఆ విషయాన్ని బలరామునకు తెలియ పరచి, కృష్ణయ్య, నగరం వెలుపలకు వచ్చాడు.

కృష్ణయ్య నగరద్వారంలో ఉండగానే కాల యవనుడు చూశాడు. చూసి ...



## ★ 4. వ, రంగం ★

[ కాలయవనుడు తన డేరాముందు నుంచున్నాడు; నగర ద్వారం వేపు చూస్తున్నాడు. అతని సేనాపతులు అతని ప్రక్కనే ఉన్నారు. వారు అతని చూపులతో తమచూపులు కలిపి, అదో విధమైన ఆశ్చర్యాన్ని వెలువరుస్తున్నారు. అంతలో కాలయవనుడు వారి వంక చూశాడు. చూసి... ]

**కాలయవనుడు:**

"కరి సంఘుంబులు లేవు రావు తురగా
ఘుంబుల్ రథ వ్రాతముల్
పరి సర్పింపవు రారు శూరులు ధను
ర్బాణాసి ముఖ్యాయుధో
త్కరముం బట్టడు శక్రచాప యుత మే
ఘ స్ఫూర్తితో మాలికా
ధరు డొక్కండ డదె నిర్గమించె నగర
ద్వారంబునం గంటిరే!"

[ సేనాపతులు యేదో ఆలోచనతో తల లాడించారు. ]

... ఉఁహూఁ ...! మనం యిక్కడికి వచ్చి యిన్నాళ్లయితే, యీాయన యీ రోజున యిలా కనబడ్డాడు!

**సేనాపతి: 1.**

( సందేహంతో )

ఇంతకూ ... ఈయన ...

**కాలయవనుడు:**

... ఆయనే ...! నారద మహర్షి చెప్పిన ఆ నల్లనయ్యే! అవుగో ... మకర కుండలాలు! ...అదే...కౌస్తుభమణి పదకం!

[ 'ఊ' నా' నన్నట్టుగా సేనాపతులు తలలూపారు; అప్ర యత్నంగానే కత్తులు దూశారు. ]

... కృష్ణా... ! కృష్ణా... ! ...కృష్ణయ్యా... !

[ అలా కేకవేస్తూనే, కాలయవనుడు, సేనాపతుల వేపు చేయి చాచాడు. ఒక సేనాపతి అందించిన ఖడ్గాన్ని తీసు కున్నాడు. తీసుకోవటమే తడవుగా ముందుకు ఉరికాడు.

అంత వరకూ, కృష్ణయ్య, యేదో పరధ్యానంలో ఉన్నట్టు న్నాడు; కాలయవనుని గమనించనట్టుగానే అతని వేపుగా వెడుతున్నాడు.

కృష్ణయ్య తన సమీపానికి రాగానే కాలయవనుడు విరగబడి నవ్వాడు. అది గ్రహించిన కృష్ణయ్య తలెత్తి చూశాడు ; గుండె చెదిరిపోయినట్టుగా గిఱ్ఱున వెనక్కు తిరిగాడు; కాలికి బుద్ధి చెప్పాడు.

అలా పారిపోతున్న కృష్ణయ్యను చూసి కాలయవనుడు వికటాట్ట హాసం చేశాడు. ]

... ఆగు ... ఆగు ...!!

"యదు వంశోత్తమ పోకు పోకు రణమీ
నర్హంబు కంసాదులం
గదన క్షోణి జయించి తీవని సమి
త్కామంబునన్ వచ్చితిన్
విదిత ఖ్యాతులు వీటి బోవ నరికిన్
వెన్నిచ్చి యిభ్భంగి నే
గుదురే రాజులు రాజమాత్రుడవె
వైగుణ్యంబు వచ్చుంజుమీ !"

[ అలా అంటూనే, అతను, కృష్ణయ్య వెనుక పరిగెత్తాడు. ]



## ★ 5. వ, రంగం ★

[ మధురానగరం వెలుపల ఒక సమతల ప్రదేశం. అందులో అప్పుడప్పుడు వెను దిరిగి చూసుకుంటూ కృష్ణయ్య పరిగెత్తుతున్నాడు. కాలయవనుడు అతణ్ణి తరుముకుంటూ వెడుతున్నాడు. ]

**కాలయవనుడు:** కృష్ణా ...!

"శరముల్ దూఱవు మద్ధనుర్గుణలతా
శబ్దంబులో లేవు నా
హరి రింఖోద్ధత ధూళి గప్ప దకటా
హాస్యుండవై పాఱె దు
ర్వారప్రౌఢిఁ నే క్రియ బోరితో కదిసి మున్
వాతాశితో, గేశితో
గరితో మల్లురతో జరాతనయుతో
గంసావనీ నాథుతోన్."

[ అని అంటూ, రొప్పుకుంటూ, తిరిగి ముందుకు ఉరికాడు. ]

★

## ★ 6. వ, రం గం ★

[ కృష్ణయ్య అదే పనిగా పరిగెత్తుతున్నాడు. అయినా అతని ముఖంలో చిరునవ్వు చిందులేస్తూనే ఉంది. అతణ్ణి తరుముకుంటూ వెడుతున్న కాలయవనుడు, ఒకసారి ఆగాడు. ఆగి... ]

**కాలయవనుడు:** ... మాధవా!

"బలిమిన్ *మానక* నేడు నిన్ను భువన
ప్రఖ్యాతిగా బట్టుదున్
జలముల్ సొచ్చిన భూమి క్రింద జనినన్
శైలంబుపై నెక్కినన్
బలిదండన్ విలసించినన్ వికృత రూ
పంబుం బ్రవేశించినన్
జలధిం దాటిన నగ్రజన్మ హాలికా
శ్వాటాకృతుల్ దాల్చినన్."

[ అలా అంటూనే, కాలయవనుడు, తిరిగి పరుగు పెట్టాడు. ]



## ★ 7 వ, రంగం ★

[ కృష్ణయ్య ఒక గుహకు సమీపించాడు; ఆగాడు.

కృష్ణయ్యను తరుముకుంటూ వస్తున్న కాలయవనుడు అది చూసి, కొంచెంగా ఊపిరి పీల్చుకోవటానికి ప్రయత్నం చేశాడు. అది గ్రహించిన కృష్ణయ్య, కాలయవనుని వంక చూస్తూ జబ్బచరిచాడు; చిలిపిగా నవ్వాడు.

కాలయవనునికి ఉక్రోషం వచ్చింది. వెంటనే అతను కృష్ణయ్యమీదికి ఉరికాడు. అతనలా ఉరకగానే, కృష్ణయ్య ప్రక్కనే ఉన్న గుహలో దూరాడు. ]



## ★ 8. వ, రం గ ం ★

[ అదొక చీకటి గుహ. అందులో ఒకరాతిమీద పడుకుని, ముచికుందుడు నిద్రపోతున్నాడు. కాలయవనుడు అక్కడకు వచ్చాడు. వచ్చీ రావటంతోటే, ముచికుందుని చూసి, అతనే కృష్ణయ్య అనుకున్నాడు. అనుకోవటమే కాదు; తన శ్రమ ఫలించిందన్న అభిప్రాయంతో వికటాట్టహాసం చేశాడు. ]

**కాలయవనుడు:**

" ఆలము సేయలేక పురు
 పాథమ దుర్లభ కంటక ద్రుమా
భీలమహాశిలా సహిత
 భీకర కుంజగ ఖడ్గ సింహ శా
ర్దూల తరక్షు సంకలిత
 దుర్గ పథంబున బాఱుతెంచి యీ
శైల గుహాగ్ర సన్నిద్ర క్రియ
 జాగి నటించిన బోవనిత్తునే "

... పిరికి పందా!

" ఎక్కడ నెవ్వారలకును
జిక్కవనుచు నారదుండు సెప్పెను నాకుం
జిక్కితి వెక్కడ బోయెదు
నిక్కముగా నిద్రపుత్తు నిన్నీకొండన్ "

[ అలా అంటూనే, కాలయవనుడు కాలెత్తి ఒక తన్ను తన్నాడు. ఆ శబ్దం గుహాఅంతటా ప్రతిధ్వనించింది. ముచికుందునకు నిద్రాభంగ మయింది. ఆయన వెంటనే లేచాడు. లేచి ఒళ్లు విరుచుకుని, కళ్లు నులుముకుని కాలయవనుని వంక తీక్షణంగా చూశాడు.

అంతే. అక్కడ మహాగ్ని పుట్టుకొచ్చింది. ఆమంటలో చిక్కుకుని, "కృష్ణా! ..కృష్ణా...!!" అని అరుస్తూ కాలయవనుడు కాలిపోయినాడు; భస్మమైనాడు.

అంతలో కృష్ణయ్య అక్కడకు వచ్చాడు.

అతణ్ణి చూసి ముచికుందుడు ఆశ్చర్యపోయినాడు; లేచి నుంచున్నాడు; చేతులు జోడించాడు. ]

ముచికుందుడు: ... మహాత్మా!

" శశివో యింద్రుడవో విభావసుడవో
చండ ప్రభారాశివో
శశి చూడామణివో పితామహుండవో
చక్రాంక హస్తుండవో
దిశలుఁ భూమియు మిన్నునిండె నిదె నీ
తేజంబు జూడంగ దు
ర్వశమై యెవ్వడ వేల వచ్చి తిచటన్
వర్తించె దేకాకివై "

కృష్ణయ్య: ( మందహాసంచేస్తూ )

... ముచికుందా!

" భూరజంబులనైన భూనాథ యెన్నంగ
జనుగాని నా గుణ జన్మ కర్మ
నామంబు లెల్ల నెన్నంగ నెవ్వరు జాల
రదియేల నాకును నలవిగాదు
నేలకు వ్రేగైన నిఖిల రాక్షసులను
నిర్జించి ధర్మంబు నిలువ బెట్ట
బ్రహ్మచే మున్ను నే బ్రార్థింప బడి వసు
దేవునింటను వాసుదేవు డనగ
గరుణ నవతరించి కంసాఖ్యతో నున్న
కాలనేమి జంపి ఖలుల మఱియు
ద్రుంచుచున్నవాడ దొడరి నీ చూడ్కినీ
ఱైనవాడు కాలయవను డనఘ!

[ ముచికుందుడు వెలా తెలా బోతూ కృష్ణయ్య వంక చూశాడు. ]

... మహాత్మా! నువ్వు నీ గతాన్నంతనీ మరచి పోయినావు. నువ్వు మాంధాత కుమారుడవు. నీ పేరు ముచికుందుడు. పూర్వం నువ్వు దేవతల కెంతో సహాయం చేశావు. అప్పుడు వారు నిన్ను అను గ్రహించి, యేదైనా వరం కోరుకోమన్నారు. వారి శక్తి సామర్థ్యాలు తెలియక, నువ్వు, 'నాకు మోక్షం ప్రసాదించండి!' అని వారి నడిగావు.

మోక్షాన్ని ప్రసాదించే అర్హత వారికి లేదు. అందుకనే, వారు, 'మరొకటి యేదైనా కోరుకో వలసింది' అన్నారు.

అది నీకు నిరాశ కలిగించింది. అప్పటికే, నీ భార్యా బిడ్డలూ మరణించారు. నీ బ్రదుకు నీకే భారంగా ఉంది. అందుకనే, 'నాకు మరేమీ వద్దు. నన్ను హాయిగా నిద్దుర పోనివ్వండి' అన్నావు. దానికి వారు 'సరే' అన్నారు; గాఢమైన నిద్దురనే నీకు వరంగా ప్రసాదించారు. అందుకనే నువ్విక్కడ యింత వరకూ ఒళ్లు తెలియని నిద్దురలో ఉండిపోయినావు. అదే నీ చరిత్ర!

[ అది విన్న ముచికుందుడు ఆశ్చర్యంతో కృష్ణయ్య వంక చూశాడు. అతని కదంతా ఒక కలగా తోచినట్టుంది. ]

... ముచికుందా ...! నీ కోరిక యేమిటో ఇప్పుడు చెప్పు ...!

[ ఆమాట విన్న ముచికుందుడు కృతజ్ఞతాభారంతో కృంగి పోయినాడు. 'దేవాధిదేవా!' అంటూ కృష్ణయ్య కాళ్లను చుట్టేసుకున్నాడు. కృష్ణయ్య అతనివంక సానుభూతితో చూశాడు; మందహాసం చేశాడు; అతణ్ణి లేవ నెత్తాడు. ]

**ముచికుందుడు:**

పరంధామా!

"సంసారినైయున్న జనునకు నీశ్వర
నీ కృప యెప్పుడు నెఱయ గల్గు
నప్పుడ బంధంబు లన్నియు దెగిపోవు
బంధ మోక్షంబైన బ్రాప్తమగును
సత్సంగమంబు సత్సంగమంబున నీదు
భక్తి సిద్ధించు నీ భక్తి వలన
సన్ముక్తియగు నాకు సత్సంగమము కంటె
మునురాజ్యబంధ నిర్మూలనంబు
గలిగినది దేవ నీ యనుగ్రహము గాదె
కృష్ణ నీసేవ గాని తక్కినవి వలదు
ముక్తి సంధాయివగు నిన్ను ముట్ట గొలిచి
యాత్మబంధంబు గోరునే యార్యు డెందు?"

**కృష్ణయ్య:** (సంతృప్తితో ఆతనివంక చూస్తూ)

... ముచికుందా!

"మంచిది నీదు బుద్ధి నృప
మండన నీవు పరార్థ్యమెట్లు వ
ర్తించిననైన గోరికల
దిక్కున జిక్కవు మేలు నిర్మలో
దంచిత వృత్తి నన్ గొలుచు
ధన్యు లబుద్ధులు నిట్లు నీకు ని
శ్చంచల భక్తి గల్గెడిని
సర్వము నేలుము మాననేటికిన్"

[ అదివిన్న ముచికుందుడు "కృష్ణా...! కృష్ణా...!!" అంటూ తన్మయత్వంతో, తిరిగి అతని పాదాలమీద వ్రాలాడు. కృష్ణయ్యా మందహాసంచేస్తూ అతని శిరస్సు నిమిరాడు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

1. కృష్ణయ్య
2. బలరాముడు
3. రుక్మిణి
4. అగ్నిద్యోతనుడు
5. భీష్మకుడు
6. రుక్మి
7. జరాసంధుడు
8. శిశుపాలుడు



# రుక్మిణీ కళ్యాణం

## ★ 1. వ, రంగం ★

[ ఒక కథకుడు రుక్మిణీ కళ్యాణానికి సంబంధించిన గాథను చెబుతున్నాడు. ]

కథకుడు: ... విదర్భ దేశాధిపతి అయిన భీష్మకునికి, రుక్మి, రుక్మధర, రుక్మబాహు, రుక్మికేశ, రుక్మనేత్రు లనే అయిదుగురు కొడుకులూ, రుక్మిణి అనే కూతురూ ఉన్నారు.

ఆ రుక్మిణి లక్ష్మీదేవి అంశతో పుట్టింది. ఆమె మహా గుణవంతురాలు; సౌందర్యరాశి.

రుక్మిణికి పెళ్లియీడు వచ్చింది. ఆ సమయంలో, ఆమె...

"తన తండ్రి గేహామునకుం
జను దెంచుచు నున్న యతిథి జనుల వలన కృ
ష్ణుని రూప బల గుణాదులు
విని కృష్ణుడు దనకు దగిన విభుడని తలచెన్"

"ఆ లలన రూపు బుద్ధియు
శీలము లక్షణము గుణము చింతించి తగన్
బాలారత్నము దన కి
ల్లాలుగ జేకొందు ననుచు హరియుం దలచెన్"

అదలా ఉండగా ...

"బంధువు లెల్ల కృష్ణునకు
బాలిక నిచ్చెదమంచు శేముషీ
సింధువులై విచారములు
సేయగ వారల నడ్డపెట్టి దు
స్సంధుడు రుక్మి కృష్ణునెడ
జాల విరోధము జేసి మత్తపు
ష్పంధయ వేణి నిత్తు శిశు
పాలున కంచు దలంచె నంధుడై"

"అన్న తలంపు దా నెఱిగి
య న్నవనీరజగంధి లోన నా
పన్నత నొంది యాప్తుడగు
బ్రాహ్మణు నొక్కని జీరి గర్వ సం
ఛన్నుడు రుక్మి నేడు నను
జైద్యున కిచ్చెద నంచు నున్నవా
డెన్నివిధంబులం జని బు
ధేశ్వర చక్రికి విన్నవింపవే!"

అని ప్రతిమాలుకుంది.

ఆ బ్రాహ్మణుడు ఆమె కోరిక తీర్చటానికి అంగీకరించాడు. ఆ వెంటనే, ఆమె, అతనిని అమితంగా సన్మానించింది. శ్రీకృష్ణునకు విన్నవించుకోదలచిన విషయాల నన్నింటినీ అతనికి వినిపించింది. ఆమీాద, ఆ బ్రాహ్మణుడు, ఒక సుముహూర్తం చూసుకుని, మధురానగరానికి బయలుదేరి వెళ్లాడు. అక్కడ...



## ★ 2. వ రంగం ★

[ అది మధురానగరంలోని రాజమందిరం. అక్కడ, శ్రీకృష్ణ బలరాములు, తమ విలాస భవనంలో ఉన్నారు. రుక్మిణీదేవి పంపిన బ్రాహ్మణుడు, వారిమధ్య, ఉచితాసనం మీద కూర్చొని ఉన్నాడు. ]

కృష్ణుడు: ... మహాత్మా!

" ఎవ్వని దేశమం దునికి
యెవ్వనిచే గుశలంబు గల్గు మీ
కెవ్వని రాజ్యమందు బ్రజ
లెల్ల సుఖింతురు వాడు మత్ప్రియుం
డివ్వన రాశి దుర్గమున
కె ట్లరు దెంచితి వయ్య నీవు నే
నవ్వులు గావు నీ తలపు
నం గల మే లొనరింతు ధీమణీ "

బ్రాహ్మణుడు:

దేవా! మాది విదర్భ దేశం. భీష్మకుడు మా రాజు. ఆయన కుమార్తె రుక్మిణీదేవి తమకు నివేదించుకో వలసిందిగా ఒక సందేశం పంపింది.

కృష్ణుడు: సంతోషం. ఏమిటది ?

బ్రాహ్మణుడు: ఆవిడ అన్నమాట లివి!

" శ్రీయుత మూర్తి యో పురుష
సింహామ సింహాము పాలిసొమ్ము గో
మాయువు గోరు చందమున
మత్తుడు చైద్యుడు నీ పదాంబుజ

ధ్యాయిని నైన నన్ను వడి
దా గొని పోయెద నంచు నున్న వా
డా యథమాథముం డెఱుగ
డద్భుతమైన భవత్ప్రతాపముల్"

"వ్రతముల్ దేవ గురు ద్విజన్మ బుధసే
వల్ దాన ధర్మాదుల్
గత జన్మంబుల నీశ్వరుల్ హరి జగ
త్కల్యాణు గాంక్షించి జే
సితి నేనిన్ వసుదేవ నందనుడు నా
చిత్తేశుడౌ గాక ని
ర్జితులై పోదురు గాక సంగరములో
జేదీశ ముఖ్యాధముల్"

[ అది విన్న శ్రీకృష్ణుడు బలరాముని వంక చూశాడు; యిద్దరూ మందహాసం చేసుకున్నారు. ]

ఆపైన, యిలా మనవి చేసుకోమని కూడా ఆమె సెలవిచ్చింది.

"అంకిలి సెప్పలేదు, చతు
రంగ బలంబుల తోడ నెల్లి యో
పంకజనాభ నీవు శిశు
పాల జరాసుతులన్ జయించి నా
వంకకు వచ్చి రాక్షస వి
వాహమునన్ భవదీయ శౌర్యమే
యుంకువ సేసి కృష్ణ పురు
షోత్తమ చేకొని పొమ్ము వచ్చెదన్"

[ శ్రీకృష్ణుడు రుక్మిణీదేవి ఆవేదనను గ్రహించినట్టుగా నిట్టూర్చాడు. ]

తుది మాటగా ఆమె విన్నవించుకున్న దిది...

[ అది విన్న శ్రీకృష్ణుడు 'అదేమిటి?' అన్నట్టుగా ఆ బ్రాహ్మణుని వంక చూశాడు. ]

"ఘను లాత్మీయ తమో నివృత్తి కొఱకై
గౌరీశు మర్యాద నె
వ్వని పాదాంబుజ తోయమందు మునుగన్
వాంఛింతు రే నట్టి నీ
యనుకంపన్ విలసింప నేని వ్రత చ
ర్యన్ నూరు జన్మంబులన్
నిను జింతించుచు బ్రాణముల్ విడిచెదన్
నిక్కంబు ప్రాణేశ్వరా",

[ శ్రీకృష్ణుడు పరమానందాన్ని పొందాడు. బలరాముని వంక ఓరగా చూశాడు. ]

... కృష్ణా!

"ఆ యెలనాగ నీకు దగు
నంగనకుం దగు దీవు మా యుపా
ధ్యాయుల యాన పెండ్లి యగు
దప్పదు జాడ్యము లేల నీవు నీ
తోయము వారి గూడుకొని
తోయరుహానన దెత్తు గాని వి
చ్ఛేయుము శత్రులన్ నుఱుము
సేయుము సేయుము శోభనంబులన్"

కృష్ణుడు: ( బ్రాహ్మణునకు నమస్కరించి )

... మీ పలుకులు మాకు అమృతపు చినుకులుగా ఉన్నై!

"కన్నియ మీద నా తలపు
గాఢము కూరుకురాదు రేయి నా
కెన్నడు నా వివాహము స
హింపక రుక్మి దలంచు కీడు నే

మున్నె యెఱుంగుదుం బరుల
మూక వధించి కుమారి దెత్తు వి
ద్వన్నుత మ్రాను ద్రచ్చి నవ
వహ్ని శిఖల్ వడి దెచ్చు కైవడిన్"

[ బ్రాహ్మణుడు, అమితమైన సంతృప్తితో, కృష్ణయ్యవంక చూశాడు. ]

"వచ్చెద విదర్భ భూమికి
జొచ్చెద భీష్మకుని పురము సురుచిర లీలం
దెచ్చెద బాలన్ వ్రేల్మిడి
వ్రచ్చెద నడ్డంబు రిపులు వచ్చిన బోరన్"

**బ్రాహ్మణుడు:** ... మహాప్రసాదం!

**కృష్ణుడు:** ఇదే మీ రాకుమారికి మా ప్రతి సందేశంగా మనవి చేయండి!

**బ్రాహ్మణుడు:** ... చిత్తం! సెలవిస్తారా?

**బలరాముడు:**

మా ఆతిథ్యం తీసుకోకుండానే ...

**బ్రాహ్మణుడు:**

అయ్యయ్యో ... యెంతమాట? కాకపోతే ...

**బలరాముడు:**

( మందహాసం చేస్తూ )

... ఆలసిస్తే మా మఱదలు ఆగ్రహిస్తుంది కాబోలు!

[ కృష్ణయ్య ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు. ]

**బ్రాహ్మణుడు:**

అహాఁ హాఁ ... ఆగ్రహిస్తుందని కాదు; యే అఘాయిత్యానికి పూనుకుంటుందో అని!

[ కృష్ణ బలరాములు ఒరిక వంక ఒకరు చూసుకున్నారు; సంతృప్తితో చిరునవ్వు నవ్వు కున్నారు. ]



## ★ 3. వ, రంగం ★

[ అది భీష్మకుని మందిరం. ఆ ప్రదేశమంతటా మంగళ తూర్య నాదాలు మారుమోగుతున్నై.

సభామంటపం ముందు నుంచుని భీష్మక మహారాజూ, ఆయన కుమారులూ, వస్తున్న రాజులకూ, రాకుమారులకూ స్వాగతం చెబుతున్నారు. ]

ఒక ఉద్యోగి:

శ్రీ శ్రీ శ్రీ మగధాధిప...జరాసంధ మహారాజ... విజయీ భవ ... విజయీ భవ !!

[ జరాసంధుడు ప్రవేశించాడు. భీష్మకుడు, అతనికి చిరునవ్వుతో స్వాగతం చెప్పాడు. ఆ వెంటనే అతను భీష్మకునికి నమస్కరించి లోపల ప్రవేశించాడు. ]

శ్రీ శ్రీ శ్రీ దంత వక్త్ర ధరాధిపా ... విజయీ భవ ...! విజయీ భవ!!

[ దంతవక్త్రుడు ప్రవేశించాడు. భీష్మకునకు గౌరవంచూపి, అతని ఆతిథ్యాన్ని స్వీకరించి లోపలకు వెళ్లాడు. ]

శ్రీ శ్రీ శ్రీ చైద్యవంశ పయః పారావార రాకా సుధాకరా, శౌర్యజిత శంకరా, శిశుపాల ధరాతలేశ్వరా ... విజయీభవ ... విజయీ భవ !!

[ శిశుపాలుడు ప్రవేశించాడు. అతను కనబడగానే రుక్మి యెదురు వెళ్లి అతణ్ణి ఆలింగనం చేసుకున్నాడు. అది చూసిన భీష్మకుడు మందహాసం చేశాడు. ]



# ★ 4. ప్రరంగం ★

[ అది రుక్మిణీదేవి పడకగది. అక్కడున్న పూలపాన్పుమీద రుక్మిణీదేవి కూర్చుని ఉంది.

రుక్మిణీదేవి యేదో ఆలోచనలో ఉన్నది. ఆమె ముఖంలో అమితమైన ఆందోళన కనబడుతోంది. ]

**రుక్మిణి:**

"లగ్నం బెల్లి వివాహము౦ గదిసె నే
లా రాడు గోవిందు డు
ద్విగ్నం బయ్యెడి మానసమ్ము వినెనో
వృత్తాంతముఁ బ్రాహ్మణుం
డగ్ని ద్యోతను డేటికిం దడసె నా
యత్నంబు సిద్ధించునో
భగ్నంబై చనునో విరించి కృతమె
బ్భంగిం బ్రవర్తించునో"

"ఘనుడా భూసురు డేగెనో నడుమ మా
ర్గ శ్రాంతుడై చిక్కెనో
విని కృష్ణుండిది తప్పుగా దలచెనో
విచ్చేసెనో యీశ్వరుం
డనుకూలింప దలంచునో తలపడో
యార్యా మహాదేవియుఁ
నను రక్షింప నెఱుంగునో యెఱుగదో
నా భాగ్య మెట్లున్నదో"

[ అలా ఆలోచిస్తూనే ఆమె నిట్టూర్చింది. అంతలో అగ్ని ద్యోతనుడు ప్రవేశించాడు. ]

అగ్నిద్యోతనుడు:

... ధన్యురాలివమ్మా తల్లీ ... నువ్వు ... నిజంగా ధన్యురాలివే!

[ రుక్మిణి తలెత్తి అటుగా చూసింది. కన్నీరు తుడుచుకుంది. ప్రాణం లేచి వచ్చినట్టుగా, మంచందిగి ఆయనకు నమస్కరించింది. ]

... ఆ నల్లనయ్య నిన్ను అమితంగా మెచ్చుకున్నాడు!

[ సంతోషంతో ఆమె తిరిగి అతనికి నమస్కరించింది; సిగ్గుతో తల వంచుకుంది. ]

అంతే కాదు;

" *మెచ్చి* భవద్గుణోన్నతి క
మేయ ధనావళు లిచ్చె నాకు దా
వచ్చె సుదర్శనాయుధుడు
వాడె సురాసురులెల్ల నడ్డమై
వచ్చిన నైన రాక్షస వి
వాహమునం గొని పోవు నిన్ను నీ
సచ్చరితంబు భాగ్యమును
సర్వము నేడు ఫలించె గన్యకా!"

[ రుక్మిణీదేవి ముఖం పూర్తిగా విప్పారింది. ఆమె చెక్కిళ్ల వెంట ఆనందబాష్పాలు జలజలా రాలినై. ఆమె మాట్లాడలేక పోయింది; అయినా... ]

**రుక్మిణి:** ... మహాత్మా!

“ జలజాతేక్షణు దోడి తెచ్చితివి నా
సందేశముం జెప్పి నన్
నిలువం బెట్టితి నీ కృపన్ బ్రతికితిన్
నీ యంత పుణ్యాత్ములన్
గలరే దీనికి నీకు బ్రత్యుపకృతిం
గావింప నేనేర నం
జలి గావించెద భూసురాన్వయ మణీ
సద్బంధు చింతామణీ !”

[ అంటూనే, ఆమె, చేతులు జోడించింది. ఆయన, చిరునవ్వుతో, ఆమెను ఆశీర్వదించాడు. ]



## ★ 5. వ, రంగం ★

[ అది భీష్మక మహారాజు ప్రాసాదం. అందులో ఒకచోట ముగ్గురు ముత్తయిదువులు ముచ్చటించుకుంటున్నారు. ]

ముత్తయిదువు: 1.

... అబ్బ ...! నిజంగా అందమనేది ఆయన సొత్తేనా అనిపిస్తోంది!

2. అనిపించటమేమిటి; ... నిజంకూడా అంతే!

1. ... ఆ ముఖం ... ఆ కళ్లూ ...

2. అయ్యయ్యొ ... అవి కళ్లు కావే ... కమలాలు!

1. అవే అవే ... ఆ పెదిమలూ ... ఆ ...

2. ...ఆహాహా...! నిజంగా...

3. ఆ యన్ని తలచుకుంటేనే అదేమిటో అదో విధంగా ఉంటుంది.

2. ఊఁహుఁ ... అంతేనా? ఆయన్ని చూస్తుంటే నిజంగా ఒళ్లంతా పులకరించదూ?

1. ఊఁహుఁ! ఆయన ముందు మహారాజు లెందుకు పనికొస్తారూ అంట!

2. ఇంకా నెమ్మదిగా అంటావేం?

1. నిజమే! ఆయనే సామాన్యుడైతే మన రాకుమారి మనసు అసలు ఆయన మీదికి పోయేదేనా ...?

2. మంచి మాటన్నావు!

1. ... ఏమైనా ...

"తగు నీ చక్రి విదర్భ రాజ సుతకుం
దథ్యంబు వైదర్భియుం
దగు నీ చక్రికి నింత మంచి
దగునే దాంపత్య మీ యిద్దఱిం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా
దర్పాహతా రాతియై
మగడౌ గావుత జక్రి యీ రమణికిన్
మా పుణ్య మూలంబునన్"

[ అలాగే అయి తీరాలన్నట్టుగా ఆ ముత్తయిదువులు, నిమీలిత నేత్రాలతో, పరమేశ్వరుని ప్రార్థించారు. ]



## ★ 6. వ, రంగం ★

[ ఊరి వెలుపల ఉన్న ఆలయం అత్యంత వైభవోపేతంగా అలంకరింపబడి ఉంది. దివ్యాభరణ భూషిత అయిన రుక్మిణీ దేవి ఆ ఆలయంలో ఉన్న ఉమామహేశ్వరుల ముందు మోకరిల్లి ఉంది. ]

**రుక్మిణి**

"నమ్మితి నా మనంబున స
నాతను లైన యుమా మహేశులన్
మిమ్ము బురాణ దంపతుల
మేలు భజింతు గదమ్మ మేటి పె
ద్దమ్మ దయాంబురాశివి గ
దమ్మ హరిం బతి సేయు మమ్మ నిన్
నమ్మిన వారి కెన్నడును
నాశము లేదు గదమ్మ యీశ్వరీ !"

[ అలా ప్రార్థించి, ఆమె, ఆ పురాణదంపతుల పాదాలకు తన శిరసును అన్చింది ; తన్ను తాను మరచి పోయింది. ]



## ★ 7. వ, రంగం ★

[ అది ఆలయం ముందు భాగం. స్వయంవరానికి వచ్చిన రాజ కుమారులు అక్కడక్కడ నిలబడి ఉన్నారు. సైనికులు దారి కిరుప్రక్కలా కాపలా కాస్తున్నారు.

అంతలో రుక్మిణీదేవి ఆలయంలోనుంచి బయటకు వచ్చింది. వస్తూనే ఓరచూపులతో అటూ యిటూ చూసింది.

అక్కడే ఓ ప్రక్కగా నాలుగు దివ్యాశ్వాలు పూన్చిన రథం ఒకటి ఉంది. రుక్మిణీదేవి దృష్టి ఆ అశ్వాలమీద పడ్డది ; అక్కడే ఆగి పోయింది.

బలరామ కృష్ణులు ఆ రథం ప్రక్కనే ఉన్నారు. రుక్మిణి వారినికూడా చూసింది. మనసులోనే వారికి నమస్కరించు కుంది. ముసిముసి నవ్వులతో ముందడుగు వేసింది.

అంతలో కృష్ణయ్య అటుగా వచ్చాడు. ఆమెను సమీపించాడు. అమాంతంగా ఆమె నడుమును చుట్టేసుకుని గబగబా రథం వేపు వెళ్లాడు.

అక్కడ ఉన్నవా ళ్లందరూ 'అరెరె ... అదేమిటి ?' అన్నట్టుగా అటు చూశారు. మరో ఆలోచన వారికి వచ్చే లోపల, మాధవుని రథం మధురానగరం వేపుగా బయలు దేరింది.

జనంలో కలకలం అప్పుడు ప్రారంభమయింది. జరాసంధుడు ముందుకు వచ్చాడు. కత్తి దూశాడు. రాతి బొమ్మల మాదిరి నిలబడి ఉన్న రాజకుమారులవంక చూశాడు. ]

**జరాసంధుడు:**

" ఘన సింహంబుల కీర్తి నీచ మృగముల్
హైకొన్న చందంబునన్
మన కీర్తుల్ గొని బాల దోడ్కొనుచు ను
న్మాదంబుతో గోపకుల్

సనుచున్నారదె శౌర్య మెన్నటికి మీ
శస్త్రాస్త్రముల్ కాల్పనే
తను మధ్యల్ విడిపింప మేని నగరే
ధాత్రీజనుల్ క్రంతలన్"

... చూస్తా రేమిటి ... పదండి! రథాలు నడిపించండి! ఆ దొంగల గుంపును యెదిరించండి! రాకుమారిని రక్షించండి! ... ఊఁ ... !

[ అది విన్న రాకుమారు లందరూ కృష్ణయ్య రథాన్ని తరుముకుంటూ వెళ్లారు. ]



## ★ 8. వ రంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

కథకుడు: ... అలా బయలుదేరిన రాకుమారులు శ్రీకృష్ణుని రథంమీద బాణవర్షం కురిపించారు. కాని, బలరాముడూ మరికొందరు గోపాలురూ దాన్ని అడ్డుకున్నారు; రుక్మిణీ కృష్ణులకు యే విధమైన అపాయమూ జరగకుండా చూశారు; అలాగే ముందుకు సాగిపోయినారు.

జరాసంధాదులకూ గోపకులకూ మధ్య జరుగుతున్న పోరాటాన్ని చూసి రుక్మిణీ దేవి అమితంగా భయపడి పోయింది. ఏమి అనటానికీ, యేమి చేయటానికీ తోచక ఆమె కృష్ణయ్యవంక దీనంగా చూసింది.

రుక్మిణీదేవిలో కలిగిన అలజడిని శ్రీకృష్ణుడు గ్రహించాడు. గ్రహించి ... ఆమెకు మనశ్శాంతిని చేకూర్చాలని నిశ్చయించుకున్నాడు. అందుకనే ... తన వెనుక ఉన్న బలరాముడు వినేటట్టుగా...ఆమెనుద్దేశించి ...

" చూచ్చెద రదె యదు వీరులు
ప్రచ్చెద రరిసేన నెల్లవైరులు పెలుచన్
నొచ్చెదరును విచ్చెదరును
జచ్చెదరును నేడు చూడు జలజాతాక్షీ!"

అన్నాడు.

ఆ వెంటనే బలరాముడు జరాసంధాదుల మీద మొదటి బాణాన్ని వదిలాడు. అది చూసిన యదు వీరులు విజృంభించారు.

రాజలోకానికీ యదు వీరులకూ మధ్య ఘోరమైన పోరాటం జరిగింది. అందులో యదువీరులదే పై చేయి అయింది. అది గ్రహించిన జరాసంధాదులు తిరోగమింపక తప్పింది కాదు. అప్పుడు ...



# ★ 9. వ్రంగం ★

[ రుక్మి, తన రథంలో నుంచుని, కృష్ణుని రథం వెడుతున్న వేపు చూస్తున్నాడు. అతనిలో అమితమైన ఆవేశం కనబడు తోంది. ]

**రుక్మి:** ... ఆగు ఆగు ... ! వెన్న దొంగా ... ఆగు ! !

" మా సరి వాడవా మా పాప గొనిపోవ
నేపాటి గలవాడ వేది వంశ
మెందు జన్మించితి వెక్కడ బెరిగితి
వెయ్యది నడవడి యెవ్వ డెఱుగు
మానహీనుడ వీవు మర్యాదలును లేవు
మాయ గైకొని కాని మలయ రావు
నిజరూపమున శత్రు నివహంబుపై బోవు
వసుధేశుడవు గావు వావి లేదు
కొమ్మ నిమ్ము నీవు గుణ రహితుండవు
విడువు విడువవేని విలయ కాల
శిఖి శిఖాసమాన శిత శిలీముఖముల
గర్వ మెల్ల గొందు గలహ మందు "

[ అలా అంటూనే అతను రథం మీదనుంచి క్రిందికిదూకి కృష్ణయ్య ఉన్న వేపుగా పరిగెత్తాడు. ]



## ★ 10. వ, రంగం ★

[ శ్రీ కృష్ణుడు కత్తి దూసి నిలబడ్డాడు; నిప్పులు కక్కుతున్నాడు. రుక్మిణీదేవి ఆయన ప్రక్కనే నుంచుని ఉంది. ఆమె ఆపాదమస్తకం కంపించి పోతోంది.

అంతలో రుక్మి ప్రవేశించాడు. ప్రవేశిస్తూనే వికటాట్టహాసం చేశాడు; కృష్ణయ్యా మీదికి కత్తి విసిరాడు.

రుక్మిణీదేవి కెవ్వున కేక పెట్టింది; కృష్ణయ్యా వెనుకకు తొలిగి నుంచుని, ముఖాన్ని అర చేతులలో కప్పేసుకుంది.

అంతలో కృష్ణయ్యా ముందుకు దూకాడు. దాంతో వారిద్దరి మధ్యా తీవ్రమైన ఖడ్గ యుద్ధం ప్రారంభమయింది. ఆ యుద్ధంలో రుక్మి చేతులోని కత్తి విరిగిపోయింది. కృష్ణయ్యా తన కత్తిని రుక్మి మీదికి విసరబోయినాడు. అది చూసిన రుక్మిణీదేవి కృష్ణయ్యను సమీపించింది; అతని పాదాల మీద వ్రాలింది. ]

రుక్మిణి: ... ప్రభూ ... !

" నిన్ను నీశ్వరు దేవ దేవుని
నిర్ణయింపగ లేక యో
సన్నుతామర కీర్తి శోభిత
సర్వలోక శరణ్య మా
యన్న యీతడు నేడు సేసె మ
హాపరాధము నీయెడన్
నన్ను మన్నన చేసి కావు మ
నాథ నాథ దయానిధీ "

[ కృష్ణయ్యా యెత్తిన కత్తిని దింపి రుక్మిణిని లేవనెత్తాడు; దగ్గరకు తీసుకున్నాడు. ]

"కల్లలేదని విన్నవించుట
గాదు వల్లభ యీతనిం
బ్రల్లదుం దెగ జూచి తేనియు
భాగ్యవంతులమైతి మే
మల్లుడయ్యె ముకుందు డీశ్వరు
డంచు మోదితులైన మా
తల్లిదండ్రులు పుత్రశోకము
దాల్చి చిక్కుదు రీశ్వరా!"

[ కృష్ణయ్య ఆమెమాటలకు కరగి పోయినాడు. ఆవెంటనే ఖడ్గాన్ని ఒరలో దింపేశాడు. మందహాసంచేస్తూ, తలవంచుకుని నుంచున్న రుక్మిని సమీపించాడు. ]

**కృష్ణయ్య:** ... బ్రతికావు బావా...నిజంగా బ్రతికావోయ్ !

[ అలా అంటూనే, సగం చచ్చిన రుక్మిని తన రథం దగ్గరకు బలవంతంగా తీసుకువెళ్లాడు. అక్కడ, ఒక త్రాటితో, ఆతనిని రథచక్రానికి కట్టేశాడు. ఆ వెంటనే, అతని మీసాలూ జుత్తూ పూర్తిగా గొరిగేశాడు; అతణ్ణి చూసి విరగబడి నవ్వసాగాడు.

తన అన్నకు జరిగిన అవమానాన్ని చూసి రుక్మిణి చాలా బాధపడ్డది ; లోలోపల యెంతగానో రోదించింది.

అంతలో బలరాముడు అక్కడకు వచ్చాడు. పరిస్థితిని అర్థం చేసుకున్నాడు. ముసిముసి నవ్వులతో రుక్మిని సమీపించాడు. ]

**బలరాముడు:**

... బావగారు బలే వేషం వేశారే !

[ కృష్ణయ్య, ఆమాట విని, తిరిగి నవ్వాడు. బలరాముడు కృష్ణయ్య వంక చూశాడు. చూసి... ]

... అయినా ...

"తలమనక భీష్మ నందను
తలయును మూతియును గొఱుగ దగవే బంధుం
దలయును మూతియు గొఱుగుట
తల దఱుగుట కంటె దుచ్ఛతరము మహాత్మా!"

... అదీ కాక ...

"కొందఱు రిపులని కీడును
గొందఱు హితులనుచు మేలు గూర్పవు నిజ మీ
వందఱి యందును సముడవు
పొందగ నేలయ్య విషమ బుద్ధి ననంతా"

[ కృష్ణయ్య చిరునవ్వు నవ్వాడు; రుక్మిణివంక ఓరగా చూశాడు. అంతలో బలరాముడు రుక్మిణిని ఉద్దేశించి... ]

... అమ్మా!

"తోడంబుట్టిన వాని భంగమునకున్
దుఃఖించి మా కృష్ణు నె
గ్గాడం జూడకు మమ్మ పూర్వభవ క
ర్మాధీనమై ప్రాణులం
గీడున్ మేలును జెందు లే డొకడు శి
క్షింపంగ రక్షింప నీ
తోడం బుట్టువు కర్మశేష పరిభూ
తుం డయ్యె నే డియ్యెడన్"

కృష్ణయ్య: ( రుక్మిణితో )

... దేవీ!

"అజ్ఞానజ మగు శోకము
విజ్ఞాన విలోకనమున విడువుము నీకుం
బ్రజ్ఞావతికిం దగునే
యజ్ఞానుల భంగి వగవ నంభోజముఖీ!"

( బుజ్జగిస్తూ )

... ఏదీ ... నవ్వు ... ! ఒక్కసారి నవ్వు !!

[ రుక్మిణి మందహాసం చేసింది. ]

**బలరాముడు:**

... కృష్ణా ! క్రొత్త మఱదలిని చూసి అయినా కొఱివి బావగారికి బంధ విముక్తి కలిగించటం భావ్యం కాదూ ?

[ కృష్ణయ్య చిలిపిగా నవ్వుతూ 'ఓ' నన్నట్టు తలపంకించాడు. రుక్మిణి ముఖం విప్పారింది.

ఆ వెంటనే, బలరాముడు, రుక్మి కట్లు విప్పాడు. అంతలో రుక్మిణిని తీసుకుని, కృష్ణయ్య తన రథం వేపుగా వెళ్లాడు.

రుక్మి, బుసలుకొడుతూ, అలాగే నుంచుని పోయినాడు. బలరాముడు అతనివంక సానుభూతితో చూశాడు. ]

**కృష్ణయ్య:** ... బావగారూ ... ! సెలవు !!

[ అంటూ చిలిపిగా రుక్మికి నమస్కరించాడు. అది చూసిన రుక్మిణి, అంత బాధలోనూ కూడా మందహాసం చేసింది. ]

